# రొమాంటిసిజం

## (ROMANTICISM)

డా॥ శివలెంక ప్రకాశరావు

ఎం.ఏ., పిహెచ్.డి.,

"పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం
ఆర్థిక సహాయంతో ప్రచురితం"

శ్రీ సరస్వతీ పబ్లికేషన్స్

కా కి నా డ

సర్వస్వామ్య సంకలితం
ప్రథమ ముద్రణ ః నవంబరు 2001
వెల ః రూ. 50/-

ప్రతులకు ః

1. **శ్రీమతి శివలెంక సరస్వతీదేవి**
1-15-8 Sl, ప్రశాంతి అపార్టుమెంట్స్
శ్రీరాంనగర్
కాకినాడ - 533 003.
ఫోన్ ః (0884) 361074

2. **విశాలాంధ్రా పబ్లిషింగ్ హౌస్**
విజ్ఞానభవన్, 4-1-435
బాంకుస్ట్రీట్, హైదరాబాద్ - 500 001
& వారి ఇతర బ్రాంచీలు

ముద్రణ ః
**శ్రీపతిప్రెస్**, కాకినాడ

## సంప్రదాయ శృంఖలాలను విచ్ఛిన్నంచేసిన తొలి సాహిత్య విప్లవం

18వ శతాబ్దంలో వాల్టేర్ రూసోల ప్రవక్తృత్వంలో అటు పారిశ్రామిక విప్లవమూ, ఇటు సాంప్రదాయక వ్యతిరేక రొమాంటిక్ రివైవలిజమ్ ఆవిర్భవించాయి. దీంతో ఈక్వాలిటీ, ఫ్రాటర్నటీ, లిబర్టీ అనే ఉదాత్తాంశాలకోసం ఉన్ముఖమైన సాహిత్యోద్యమం పురోగమించడం ఆరంభించింది. దాంతో యూరోపియన్ దేశాలలో కొత్త కవిత్వం ప్రారంభమయింది. తెలుగు సంస్కృతిలో వీరేశలింగం, గురజాడలు సంఘసంస్కరణోద్యమానికీ, సాహిత్య సంస్కరణోద్యమానికీ బాటలువేసింది మొదలు తెలుగు కవులు 'రొమాంటిసిజమ్' గురించి ఆలోచనలు సాగిస్తూనే వచ్చారు. 1910 నుంచి తెలుగు కవిత్వంలో రొమాంటిసిజమ్ ప్రారంభమయింది. ఉత్తరోత్రా భావకవిత్వానికి ఉత్సేకమందించింది అదే. ఆదశలో ప్రముఖులైన కవులందరూ ఈ రొమాంటిసిజమ్ అనే దానికి సమానార్థకమైన పదంకోసం అన్వేషిస్తూనే ఉన్నారు. కొందరు కాల్పనికవాదమనీ, మరికొందరు పునరుజ్జీవనవాదమనీ అన్నారు. ఎవరేమన్నా రొమాంటిసిజమ్ అన్న పదం విశాలార్థంలోని భాగాలను చొప్పించారే తప్ప సంపూర్ణార్థం సాధించలేక పోయారు. కనుక మనభాషలో అభివ్యక్తికి సాధ్యంకాని ఇతర భాషాపదాలను యథాతథంగా వాడుకొని, అర్థాలను, నిర్వచనాలను ఇవ్వడం తప్పుకాదు. అది మన భాషా సంపదను పెంపొందిస్తుందే తప్ప హరింపజేయదు. రామాంటిసిజం గూర్చి దాదాపు 90 సం॥ల నుండి కవులు, విమర్శకులు, ఆలోచిస్తూనే ఉన్నారు. దానిని గురించి సంగ్రహంగానైనా ఒక గ్రంథం రాకపోవడం విచారకరం. ఆలోటును మిత్రులు డా॥ శివలెంక ప్రకాశరావుగారు భర్తీ చేయడానికి ప్రయత్నించడం ముదావహం.

రొమాంటిసిజం ఆధునిక కాలంలో సకల సాహిత్య వాదాలకూ మూలంవంటిది. దాన్ని పరిశీలించడానికి ఉత్తరోత్రా పరిపక్వమైన గ్రంథాన్ని రూపొందించడానికి ఈ గ్రంథం ఎంతగానో తోడ్పడుతుందనడానికి సందేహంలేదు. నా మిత్రులు చేసిన ప్రయత్నం సార్వత్రికంగా నిర్దుష్టం కాలేదు కాని ద్వితీయ ముద్రణలో క్షాళన చేయడం కష్టం కాదు.

అందుకే డా॥ శివలెంకను మనసారా అభినందిస్తున్నాను.

పిఠాపురం
20-3-2002

డా॥ ఆవంత్స సోమసుందర్

# భూమిక

ఈ అంశం నా పరిశోధనా విషయం "భావకవులు - ప్రతిభా విస్ఫూర్తి"కి సంబంధించింది. విషయసేకరణ సందర్భంలో (1978-83) ఎన్నో ఆంగ్ల గ్రంథాల నుండి తీసుకున్న దాన్ని భావానువాదంచేసి, చాలా క్లుప్తంగా మాత్రమే పరిశోధనా గ్రంథంలో చేర్చడం జరిగింది. మిగిలినదంతా వ్రాత ప్రతుల్లోనే ఇంతకాలంగా మరుగునపడిఉంది.

నాకు తెలిసినంతవరకూ ఈ అంశంపై 'భారతి' మొదలైన సాహిత్య పత్రికలలో కొన్ని వ్యాసాలు వచ్చాయి తప్ప తెలుగులో ప్రత్యేకంగా ఒక గ్రంథం రాలేదు.

అయితే ఈ చిన్నపుస్తకం 'రొమాంటిసిజమ్' పై అందించిన ఒక 'బుక్‌లెట్' మాత్రమే కాని సంపూర్ణమైన సమగ్ర గ్రంథంకాదు. 'రొమాటిక్ పొయిట్స్'లో ఒక్కొక్కరిని గూర్చి ఆంగ్లంలో ప్రత్యేకంగా ఎన్నో గ్రంథాలు వచ్చాయి. ఆ విషయాలన్నీ ఈ చిన్న పరిధిలో ఏకరువుపెట్టడం నా లక్ష్యంకాదు. అవసరమైన మేరకు మాత్రమే ఆయా కవుల రచనా దృక్పథాన్ని క్రోడీకరించి చెప్పడం జరిగింది.

చివరలో భావకవులపై రొమాంటిక్ కవులప్రభావం ఎంత వరకూ ఉన్నదన్న విషయాన్ని దిఙ్మాత్రంగా సూచించడం జరిగింది. కాబట్టి ఈ అంశం పరిశోధకులకు కొంచెమయినా ఉపయోగపడుతుందని నా ప్రగాఢ విశ్వాసం.

ఈ అంశాన్ని పుస్తకరూపంగా తేవడానికి ఆర్థిక సహాయం అందించి ప్రోత్సహించిన తెలుగు విశ్వవిద్యాలయం హైదరాబాద్ వారికి నా ప్రత్యేకమైన కృతజ్ఞతలు.

ఈ విషయాన్ని వెలుగులోనికి తెమ్మని వెన్నుతట్టి తమ అభిప్రాయాన్ని అందించిన సాహిత్య గురువర్యులు డా॥ ఆవంత్స సోమసుందర్‌గారికి నా నమస్సుమనస్సులు.

సకాలంలో చక్కగా ముద్రించి అందజేసిన చి॥ తోట మురళి (శ్రీ పతి ప్రెస్, కాకినాడ)కీ, అన్ని యెడల సహకరించిన నా సహధర్మచారిణి చి॥ సౌ॥ సరస్వతీదేవికీ నా శుభాశీస్సులు.

పాఠకులందించిన సూచనలను ద్వితీయ ముద్రణలో పాటిస్తానని మనవి చేస్తున్నాను.

కాకినాడ
20-3-2002

భవదీయ
డా॥ శివలెంక ప్రకాశరావు

# రొమాంటిసిజం (ROMANTICISM)

ఈ లోకం పరిణామశీలమయింది. అదిదాని చైతన్యలక్షణం. మనకళ్ల ఎదుట ఉన్న ప్రకృతిలో నిత్యం ఎన్నో మార్పులు జరుగుతూ ఉంటాయి. జరిగిన ప్రతి పరిణామం పూర్వ స్థితిగతులను కదిలిస్తుంది. ప్రకృతిలో లాగానే మానవజీవితంలో కూడా ఎన్నో మార్పులు ఏర్పడుతూ ఉంటాయి. ఒక జాతి చైతన్య మెప్పుడూ దానికున్న సాంఘిక అస్తిత్వాన్ని బట్టి ఉంటుంది. కాబట్టి మానవలోకంలో కలిగే ప్రతి పరిణామం ఏదో ఒక విప్లవం ద్వారా సంభవిస్తుంది. అది ఏ కొద్దిమంది మహావ్యక్తుల ఆధ్వర్యంలోనో నిర్వహించబడుతుంది. తద్వారా భ్రష్టమైన పాతధోరణి క్రొత్తపుంతలు త్రొక్కుతుంది. దాంతో మానవజాతికి ఒక ప్రశాంతత, ఒక సుస్థిరత ఏర్పడతాయి. మానవజీవనంలో మోడయిన ఆశావల్లరి చిగిర్చి, క్రొంగొత్త ఫలాలను అందిస్తుంది.

జాతి జీవనంలోలాగానే ప్రతి సాహిత్య చరిత్రలో కొన్ని విప్లవాలు చెలరేగుతాయి. అప్పుడా సాహిత్యం వినూత్న పథంలో అడుగుపెడుతుంది. సరిక్రొత్త భావజాలాన్ని ప్రవేశపెట్టి చవులూరిస్తుంది.

ఆంగ్లసాహిత్య చరిత్రలో సంభవించిన ఒక ప్రముఖ ఉద్యమం 'కాల్పనికోద్యమం' **(Romantic Movement)** ఇది 18వ శతాబ్దంలో జరిగింది. అంతకు పూర్వం సాహిత్యలోకాన్ని ఏలిన 'సంప్రదాయ విధానం' **(Classical System)** పై ఇదిఒక తిరుగుబాటును లేవనెత్తింది. మౌలికంగా ఎక్కువ తేడా లేకపోయినా, ఆయాదేశాల కాలపరిస్థితులనుబట్టి ఈఉద్యమం ఇంగ్లండు, ఫ్రాన్సు, జర్మనీ దేశాలలో విభిన్న ధోరణులలో పయనించింది.

ప్రపంచపు మూలస్థితీ, ఆకారంవంటి విషయాలన్నీ పూర్తిగా వ్యక్తిగతమైన భావుకతా దృక్పథంపై ఆధారపడి ఉంటాయని 'ఫిక్టే' **(Fechte)** పండితుడు ప్రకటించాడు. ఈ ఆత్మాశ్రయ సిద్ధాంతం **(Subjective Philosophy)** కాల్పనికోద్యమంలో ఒక ప్రముఖ పాత్రవహించింది. ఈ వినూత్న దృక్పథమే 'బ్లేక్' **(Blake)** వంటి కవులను ఆకర్షించింది. వాస్తవికమైన బాహ్య ప్రపంచాన్ని దాటి, ఆంతరికమైన ఒక ఆదర్శాన్ని దర్శింపజేసింది. తాత్కాలికమైన ఈ బాహ్యజగత్తుకూ, ఆదర్శవంతమైన శాశ్వత సత్యలోకానికీమధ్య, సచ్ఛీలం

సౌందర్యాలకు నడుమ ఉన్న విషయాలను, అంశాలను తన భావుకతద్వారా మానవుడు కనుగొనవచ్చునే ఒక దృఢవిశ్వాసం ఏర్పడేటట్లు చేసింది.

'కీట్సు' **(Keats)** తన రసతత్త్వ వ్యాఖ్యానాన్ని **(aesthetic comments)** కొన్ని లేఖల్లో వివరించాడు. అలాగే 'వర్డ్స్‌వర్త్' **(Wordsworth)** రచించిన **'Preface to the Lyrical Ballads'** కోలరిజ్ **(Coleridge)** రాసిన **'Biographia Literaria,'** షెల్లీ **(Shelly)** రూపొందించిన **'Defence of Poetry'** అనేవి ఈ కాల్పనికోద్యమానికి ప్రణాళికా ప్రకటనల **(Manifestos)** వంటివి. ఇవి ఈ ఉద్యమస్థాయినీ, స్థితిగతులను పరామర్శిస్తాయి.

18వ శతాబ్దం చివరిలో సెలెగల్ సోదరులు జర్మనీలో ఒక సంఘంగా ఏర్పడటంతో, వర్డ్స్‌వర్త్, కోలరిజ్ 'Lyrical Ballards' ను 1798లో ప్రచురించడంతో ఈ కాల్పనికోద్యమం ఆరంభమయిందని విమర్శకుల అభిప్రాయం.

## పూర్వరంగం

అయితే ఆంగ్ల కవిత్వం డ్రైడెన్ యుగంలనుంచీ (1660-1700) క్రొత్తపుంతలు త్రొక్కడం ఆరంభించింది. దాంతో స్పెన్సర్, మిల్టన్‌వంటి మహాకవులు రూపొందించిన ధోరణులకు కాలదోషం పట్టింది. భావనకన్నా బుద్ధికి ప్రాధాన్యమేర్పడింది. పోపుయుగం (1700-1745) నాటికి ఈ ధోరణి ఇంకా బలం పుంజుకుంది. 'రినైజాన్స్' తో పునరుద్ధరించబడిన 'సంప్రదాయవిధానం' **(Classical System)** దాదాపుగా రెండు దశాబ్దాలకుపైగా రాజ్యమేలింది. కాని 17వ శతాబ్దంలో ఫ్రాన్సుదేశంలో చెలరేగిన 'నియోక్లాసికల్ విధానం' **(Neo-Classical System)** సంప్రదాయ పద్ధతిని తీవ్రంగా దెబ్బతీసింది. దాంతో సంప్రదాయ కవుల విధానాలనూ - ధోరణులను అనుసరించాలా వద్దా అనే మీమాంస ఆరంభమయింది. రాజనీతి శాస్త్రం, నీతి శాస్త్రం మొదలైన వాటిలోలాగా, భౌతిక శాస్త్రంలో న్యూటన్ సాధించినట్లుగా, కళల్లో **(Arts)** కూడా జగత్ సత్యాలకు భిన్నంగా స్థిరమైన ఒక స్థాయిని ఏర్పరచాలనే అభిప్రాయంచోటుచేసుకుంది. ఫలితంగా నిర్దుష్టమైన రచనకు కావలసిన కొన్ని నియమనిబంధనలూ, రసానికి చెందిన మూల

సిద్ధాంతాలు ఏర్పడినాయి. దాంతో కళాకారుడు (Artist) కూడా ఒక శాస్త్రవేత్తలా రూపొందవలసిన పరిస్థితి వచ్చింది. కళ అనేది ఒక సహేతుక వాస్తవానుకరణంగా, కళాకారుడొక వివేకవంతుడయిన పరిణామశీలిగా లెక్కించడం మొదలయింది. అందుకే ఒక గ్రంథ రచనను గడియారనిర్మాణంతో 'La Bruyere' సరిపోల్చాడు.

ఈ 'నియోక్లాసిజం' హేతువూ, సంక్షిప్తతలకు ఎక్కువగా ప్రాముఖ్యమిచ్చింది. సృజనలో సహేతుకం కానిదానిని అది అంగీకరించలేదు. అంతేకాక, కవిత్వానికి కావలసిన ఊహాశక్తిని చంచలమయిందిగా, సమర్థవంతం కానిదానిగా అభిప్రాయపడింది. ఊహాశక్తికి బదులు చమత్కారం (Wit) కవిత్వానికి జోడిస్తే సరిపోతుందనే ఒక సరిక్రొత్త వాదాన్ని నియోక్లాసిజం లేవనెత్తింది. దాంతో క్రమంగా పరాశ్రయ (Objective) స్థానాన్ని ఆత్మాశ్రయ (Subjective) సూత్రం ఆక్రమించింది, నియోక్లాసిజం ధోరణి వెనుకబడింది.

ఈ విషమ పరిస్థితులే 18వ శతాబ్దంలో 'ప్రీ-రొమాంటిక్ పీరియడ్' కు ఒక అనుకూల వాతావరణాన్ని ఏర్పరచాయి. హేతువుకన్నా ప్రతిభకూ, సౌందర్యానికీ, కల్పనకూ ఎక్కువ ప్రాధాన్యం ఇవ్వబడింది. బహిరంగంగా క్రొత్త భావాలను ఆహ్వానించడం ఆరంభమయింది. నిర్హేతుకమైన ఊహాశక్తికి చెందిన కృత్రిమ సౌందర్యాన్ని కొనియాడే పాత పద్ధతికి స్వస్తిచెప్పడం ఈ కాలంలో జరిగిన మరో విశేషం. అలాగే 1740-80 మధ్యకాలంలో అన్నిచోట్లా ఒక విధమైన స్వేచ్ఛావాతావరణం నెలకొన్నది. వాస్తవానికి ఈ అనుకూల పరిస్థితి 'ప్రీ-రొమాంటిసిజం' (Pre-Romanticism) కు క్రొత్త ఊపిరినందించింది.

నియోక్లాసికల్ కాలాన్ని "హేతువాదయుగం" (Age of Reason) అన్నారు. అలాగే ప్రీ-రొమాంటిక్ కాలాన్ని "అనుభూతియుగం" (Age of Sensibility) అని పిలిచారు. ఈ కాలపురచనల్లో ఆవేశం, అద్భుతమైన వాతావరణ పరికల్పనం, బ్రహ్మాండమైన పదబంధాలు, మిరిమిట్లుగొలిపే దృశ్యాలు చోటుచేసుకున్నాయి. అంతరంగికంగానేకాక, బహిరంగంగాకూడా స్వభావసిద్ధతకూ, మనోలోకం నుండి అప్రయత్నంగా పెల్లుబికే ఆత్మశక్తికీ ప్రాముఖ్యం ఏర్పడింది. దాంతో నగరాలలోని కృత్రిమ జీవితానికి ముఖ్యంగా

రాచరికపు జీవితానికి వ్యతిరేకత ఆరంభమయింది. ప్రకృతిపట్ల, నిరాడంబరమైన పూర్వ సమాజం పట్ల ఆత్మీయత పెంపొందింది. క్రమంగా ఇదే భావజాలం "ప్రకృతికి తిరిగివెళ్లు" (return to nature) అనే ఒక క్రొత్త సిద్ధాంతానికి దారితీసింది. ప్రకృతి కవులకు ఒకసాధనం మాత్రమే కాదు. అదిచాలా శక్తివంతం అనే భావన సర్వత్రా వ్యాపించింది. ఫలితంగా ప్రకృతికి సంబంధించిన పరాశ్రయ చిత్రీకరణం ఆత్మానుభూతి ప్రకటనంగా మార్పుచెందింది. 1778లో రూసో రచించిన "Reveries dupromeneur Solitaire" అనే వ్యాసం ఈ స్థితిగతులనన్నింటినీ చక్కగా వివరించింది. అలాగే Logan Pearsall Smith రచించిన "Four Romantic Words" అనే వ్యాసంలో ప్రతిభ (Genius), మౌలికత (Originality), సృజన (Creation), సద్యస్ఫురణ స్ఫూర్తి (Spontaneous) మొదలైనవాటినిగూర్చి చేసిన వ్యాఖ్యానం 'ప్రీ–రొమాంటిక్ పీరియడ్'కు చాలా అమూల్యమయింది. అదేవిధంగా young అనే మానసిక తత్త్వవేత్త అనుకరణకూ మౌలికతకూమధ్య, అధ్యయనానికీ ప్రతిభకూ మధ్య, నియమబద్ధ సృజనకూ స్వేచ్ఛగా చేసే సృజనకూమధ్య, సనాతనులకూ అధునాతనలకూమధ్య సహజంగా ఉండే తారతమ్యాలను గూర్చి ఇచ్చిన వివరణ చాలా ముఖ్యమయింది.

## పదనిర్వచనం

సాహిత్యంలో 'Romantic' పదం చేరడానికి మూలకారకుడు ఫ్రెడరిక్ సెలెగల్ (Freidrich Schlegel) ఆతడీ పదాన్ని 125 పుటలలో 1797 సం॥లో వాఖ్యానించాడు. కాని అది నిరర్థకమయింది. ఆ తరువాత ఆతడి సోదరుడు 'అగస్టు విల్‌హెల్మ్' (August Wilhelm) అంతకు ముందున్న సంప్రదాయపు కళకన్నా "ఒక భిన్నమైన ప్రత్యేకాధునిక కళాశక్తి" (The Particular Spirit of Modern Art) గా ఈ పదాన్ని అభివర్ణించాడు. అయినా ఈ పదం వర్డ్స్‌వర్త్, షెల్లీ, కోలరిజ్ రచనల్లో మచ్చుకైనా కనబడదు. కాని 1798 సం॥లలో ఫ్రెంచి అకాదెమీ నిఘంటువులో ఈ పదం చోటుచేసుకుంది. 1818 సం॥ జూన్ 28వ తేదీన కీట్సు తన సోదరుడికి రాసిన ఒక జాబులో ఈ పదాన్ని ప్రయోగించాడు. (The names romantic misses on the inn window panes) అయితే అది సాహిత్యపరమైన అర్థంలోలేదు. సాహిత్యపరంగా

మొట్టమొదటిసారి ఈ పదాన్ని 1831 సం॥లో కార్లే పండితుడు 'Schiller' పై రాసిన ఒక వ్యాసంలో ప్రయోగించాడు. (We are troubled with no controversis on Romanticism and Classicism-Miscellancies - London - 1890, Vol.III.P.71)

ఇప్పటి వరకూ ఈ పదానికి 11,396 నిర్వచనాలు వెలువడినట్లు ఒక అంచనా. (The decline and Fall of Romantic Ideal - F.L. Lucas - 1948). ఇది చాలా ఆశ్చర్యకరమైన విషయం. అయితే "Classical" పదంలాగా "Romantic" పదంకూడా అందరూ అంగీకరించేటట్లు నిర్వచించబడలేదని 1923లో గ్రియర్‌సన్ ప్రకటించాడు (The Background of English Literature - B. Prasad - P. 256). అందుకే ఈ రొంపిలోకి దిగవద్దని కొందరు హెచ్చరించారు. (E.B. Burgum-Kenyon Review - 1941).

అయినా ముఖ్యమైన కొన్ని నిర్వచనాలను పరిశీలించడం అవసరం.

1) "ఈ పదం పెక్కు అర్థాలిచ్చే ఒక మౌఖిక సంకేతం" – లౌజాయ్ (Lovejoy) (The Word 'romantic' has to mean so many things that, by itself, it means nothing. It has ceased to perform the function of a verbal sign" - On the discrimination Romanticism - English Romantic Poets - P.6)

2) దీనిని ఒక "వ్యాధి" అన్నాడు గెథె. ("Romanticism is disease, classicism is health" - Goethe - Romanticism - Lilian R. Furst (1969) - PP-2-3).

3) "అనంతమైన దానిని వర్ణించే ఒక పదం" – హెయినే (Classic art portrays the finite, romantic art also suggests the infinite - Heine - Ibid)

4) "ప్రకృతి ప్రవాహంలోనే అనంతత్త్వపు మాయను దర్శించడం" మోర్ (The illusion of beholding the infinite within the stream of nature itself, instead of apart from the stream - More - Ibid)

5) "సంప్రదాయతత్త్వానికి కాక యధార్థత్వానికి వ్యతిరేకంగా, బాహ్యానుభవంనుండి వైదొలగి అంతర్ముఖం కావడం" – ఎబర్‌క్రాంబీ. ("The opposite, not of Classicism, but of realism a withdrawal from outer experience to concentrate upon inner" - Abercrombie - Ibid)

6) "కల్పితమైన దానిని విషాదాంతంతో లేక తాదాత్మ్యస్థితిగల జీవిత సంపూర్ణ సత్యంతో మిళితంచేసే సాహిత్యంలోని సాహిత్యత్వం" – విక్టర్ హ్యూగో. (Literalism in Literature, mingling the grotesque with the tragic or subline (forbidden by classicism) the complete truth of life" - Victor Hugo - Ibid)

7) "వాస్తవికతనుండి తప్పించుకునే ఒకప్రయత్నం" – వాటర్ హౌస్ ("An effort to escape from actuality" - Water House - Ibid)

8) "హేతువుకన్నా ఆవేశానికీ, మేధకన్నా హృదయానికీ ఒక ఆధిక్యత' – జార్జిశాండ్. ("Emotion rather than reason, the heart opposed to the Head - George Sand - Ibid)

9) "మేధలోని అల్పచేతనావస్థలకొక స్వేచ్ఛ, మత్తుగొన్న ఒక స్వప్నావస్థ' – లూకస్ ("A liberation of the less conscious levels of the mind, an entoxicating dreaming" Lucas - Ibid)

10) "ఊహాపరమైన ఆత్మానుభూతికి ఒక అసాధారణమైన అభివృద్ధి' – హెర్‌ఫర్డ్. ('Extraordinary development of imaginative sensibility - Herford - Ibid)

11) "ఒక ప్రత్యేకమైన భావనాదృక్పథం, ప్రకృతి విధానం, ప్రతీక ప్రయోగాల సమ్మేళనారూపం" – వెల్లక్ ("Compounded of a particular view of Imagination, a particular attitude of nature and a particular use of symbols -Romanticism - P.4)

12) "సౌందర్యాభిలాషులకు ఉత్సుకతను పెంపొందించడం" వాల్టర్ పీటర్ ("The addition of curiosity to the desire of beauty " - A

background to the theory of English literature - B.Prasad - Machmilian Edn. 1977 - P.63)

13) "నిర్దిష్టతలేని అస్పష్టత, రహస్యమైన కాంక్ష – ప్రొ॥ బైసన్ ("Romantic poetry invariably deals with longing not a definite desire, but a dim, mysterism aspiration" - Novalis and Blue Flower - Atlantic Montly - Vol. LVII - Dec. 1875)

వీటిల్లో కాల్పనిక కవితా స్ఫూర్తి కనిపిస్తున్నది. ఉత్సుకత, సౌందర్యంపై ప్రేమ అనే రెండు విషయాలు కాల్పనికతకు ముఖ్యమైన మూలకాలని పీటర్ పేర్కొన్నాడు. ("The essential elements, then, of the Romantic sprit are curiosity and the love of beauty - Macmillan Magazine - vol. XXXV)

ఆంగ్లసాహిత్యంలో "Lake School", "Satanic School అనేవి ఉన్నాయి. కాని "Romantic School" అనేది ఎక్కడాలేదు. కాని దాదాపుగా 1798 – 1832 సం॥ మధ్యకాలంలో ఈ ఉద్యమం యూరప్ అంతటా ఒక క్రొత్త రచనా దృక్పథాన్ని ఏర్పరచింది. రసతత్త్వంలో, రచనాధోరణిలో ముఖ్యంగా సృజనాత్మక భావుకత, వ్యక్తిగతానుభూతి అనే రెండు విషయాలు ఒకనూత్న చైతన్యానికి ప్రోదిచేశాయి.

"యూరోపియన్ క్లాసిజమ్" కు అరిష్టాటిల్ పండితుడు "నిర్మాణగురువు' (Arch-priest) అలాగే ఆధునిక రొమాంటిసిజమ్‌కు రూసో మహాశయుడు "న్యాయ నిర్ణేత" (law giver). ఈ ఉద్యమం రాజకీయాలపై ఎంత తిరుగుబాటు లేవనెత్తిందో, అంతకు పూర్వం ఉన్న కవిత్వంపైకూడా అంత వ్యతిరేకతను కలిగించింది. అందుకే 18వ శతాబ్దంనుండి, మేధావంతులైన తమ పూర్వులనుండి తప్పించుకోవడం కాల్పనికుల మూలలక్ష్యం. వాస్తవానికి చరిత్ర, ప్రయాణ గ్రంథాల ద్వారా లోకంలోని భిన్నత్వాన్ని అనుభవించడమే ఇది అని విలియం యంప్సన్ (William Empson ప్రకటించాడు.

("A basic impulse of the Romantics was to escape from the eighteenth century, their enlightined parents, infact so as

to experience if only through history and travel books the variety of the world " (Introduction to the study of English Litarature - R.K. Srinivasa Iyengar and Premananda Kumar - Asia Publishing House - Bombay - 1966 - PP-15-16)

## 'రొమాంటిక్' పద ప్రచారం

ఈ పదం మొట్టమొదట ఇంగ్లండులో ప్రచారమయింది. దీనిని ఒక విశేషణంగా వ్యాప్తిలోకి తెచ్చిన మహాశయుడు ఎడిసన్. పూర్వ ప్రేమ, వీరగాథలు, సాహసకృత్యాలు, గాఢ విశ్వాసాలు మొదలైన వాటికి చెందిన **'Wild romantic tales'** వంటి పద బంధాలతో ఈ పదం ఉపయోగించబడింది. అసత్యమూ, కల్పితమూ, ఊహాత్మకమూ అయిన వాటిని తెలియజేయడానికే ఈ పదం ఇక్కడ ప్రయోగించబడింది. అయితే 17వ శతాబ్దంలోని హేతు వాదయుగంలో ఈపదం "నిరాశాజనకమైన" **(Chemerical)**, "ఉన్నతస్థాయిగల" **(bombastic)**, "అసంభవమైన" **(ridiculous)** "శైశవమైన" **(Childish)** వంటి పదాలతోబాటు వాడబడింది.

1711 సం॥ కన్నా కొంచెం ముందుకాలంలో **'romantic'** అనేది **'fine'** అనే పదంతో కలపబడింది. దాదాపుగా ఈ పదం 1798లో ఫ్రెంచి అకాడెమీవారి నిఘంటువులోకి అసలు అర్థంలో చోటు చేసుకున్నది. సాధారణంగా పద్యాలలో, నవలల్లో భావుకతకు చెందిన ప్రదేశాలనూ, దృశ్యాలను వర్ణించడానికి ఈ పదం ఉపయోగించబడింది.

తరువాత **Thomson** రచించిన **'Seasons'** తోబాటు ఈ పదం ఇంగ్లండునుండి జర్మనీకి చేరింది. ఫ్రాన్సులోలాగా జర్మనీవారుకూడా **'romanhaft'** అనే పదాన్ని ఏర్పరచుకొని, పాత పదానికి బదులుగా వన దృశ్యవర్ణనలలో దీనిని అన్వయించారు.

కాబట్టి **'Romantic'** అనే పదం మొదట్లో సాహిత్య విమర్శ నుంచి పుట్టలేదు. భావుకతకూ, ఉద్రేకానికీ చెందిన వస్తువులపై సానుకూలంగా మేధను మరల్చడాన్ని తెలిపే పదంగా ఇది వాడబడింది.

సాహిత్యంలో ఈ పదం కనబడడంవల్ల **'Romantic movement'** ఏర్పడలేదు. 18వ శతాబ్దంలో ప్రజల ప్రవర్తనలో చాలా ఎక్కువగా కలిగిన మార్పులవల్ల ఈ ఉద్యమం వచ్చింది. **Romantic** అనే పదంతోబాటు మౌలికత, సృజన, ప్రతిభ అనే పదాలు రచనా శైలిని బట్టే కాదు మొత్తం మానవ దృక్పథంపై ప్రభావం చూపి అసలు మూలతత్త్వాన్ని మార్పుచేయడానికి ఏర్పడినాయి. ఈ విధంగా రొమాంటిక్ ఉద్యమం అనేది మానవుడు ఒక అత్యున్నత స్థాయిని చేరడానికి ఎంతో కాలంపాటు జరిగిన ఒక పెద్ద పరిణామం.

## కాల్పనికోద్యమం (Romantic movement )

**Schelegal** సోదరులు 18వ శతాబ్దం చివరి సంవత్సరాలలో జర్మనీలో ఒక సంఘంగా ఏర్పడటంతో, వర్డ్స్‌వర్త్, కోలరిజ్ అనే ఇద్దరూ 1798లో **'Lyrical Ballads"** ను ప్రచురించడంతో కాల్పనికోద్యమం ఆరంభమయినట్లు పరిగణించబడుతుంది. కాని ఆవిధమైన కాల్పనికాభిప్రాయాలూ, భావాలూ, శైలీ విన్యాసాలు అంతకుముందు కాలంలో కూడా కనిపిస్తాయి. అందుకే మొత్తం 18వ శతాబ్దమంతా ఆ ఉద్యమపు మూలతత్త్వపునర్వ్యవస్థీకరణ **(re-orientation)** జరుగుతూనే ఉందని చెప్పవచ్చు.

నిజానికి **Pre-romanticism** యొక్క కొనసాగింపే కాల్పనికోద్యమం. అయితే భావుకత్వ విషయంలో మాత్రం ఈ ఉద్యమం దానికన్నా ఎక్కువ. 18వ శతాబ్దంలో ఆంగ్ల కాల్పనిక కవులను మిగతా కవులనుండి వేరు చేసి చెప్పేది వారి భావుకతాలక్షణమే.

ఈ భావుకత **'Biographia Literaria'** లోనూ **'The expression of imagination'** అని సూత్రీకరించిన షెల్లీ **'Defence of Poetry'** లోనూ ఒక ముఖ్యాంశంగా రూపొందింది. అలాగే వర్డ్స్‌వర్త్ "కవిత్వమనేది భావుకత **(Works of imagination and sentiment)** అని నిర్వచించాడు. తన సోదరుడు జార్జికి 18-9-1819న రాసిన ఒక జాబులో **"I discribe what I imagine"** అని పేర్కొన్నాడు. లోకాన్ని చిత్రీకరించేటప్పుడు కనబడే ఒక ఆదర్శాన్ని ఈ పదబంధం ప్రకటించింది. అయితే బైరన్ అనే కవి ఈ సృజనాత్మక భావుకతకు కట్టుబడలేదు. కాని 18వ శతాబ్దానికి చెందిన కోలరిజ్. షెల్లీ,

బ్లేక్, కీట్సు, వర్డ్స్వర్త్ వంటి కవులతో బైరన్‌కు చాలా సామ్యంఉంది.

వర్డ్స్‌వర్త్ కాలంలో హెర్‌ఫర్డ్ ఆంగ్ల కాల్పనికుల్ని మూడు తెగలుగా విభజించాడు. 1) వర్డ్స్‌వర్త్ తెగ - (1798-1806) స్టోయీ, గ్రాస్‌మేర్, కోలరిజ్, క్రాబ్ఫీక్లేర్ అనేవారు. ప్రకృతికీ మనిషికీ ఉన్న సాన్నిహిత్యంపై వీరు ఎక్కువగా మొగ్గుచూపించారు. 2) స్కాట్ తెగ (1805-10) కాంప్‌బెల్, మూర్, సోంథీ అనేవారు ఆచారంలో సంప్రదాయంలో ఎక్కువగా వీరు మునిగిపోయి, ముఖ్యంగా దానిని తమ **'narrative poerty'** లో ప్రకటించారు. 3) షెల్లీ తెగ (1818-22) బైరన్, కీట్సువంటివారు. స్వేచ్ఛావాదం, సౌందర్యంఅనే విషయాలపై వీరు తమ ఆసక్తిని వ్యక్తీకరించారు.

అయితే ఈ విభజన నామమాత్రమే. లేకపోతే ఇది ఎన్నో సమస్యలకు మూలకారణ మవుతుంది. ఎందుకంటే పరస్పర సంబంధంలేకపోవడమనేది ఆంగ్ల కాల్పనికోద్యమ లక్ష్యాలలో ఒకటి. అది వ్యక్తిత్వానికి ఒక ముఖ్యలక్షణం. దాని నుంచి విభిన్నత్వం, శక్తి, నూతనత్వం పుడతాయి.

ఆంగ్లకాల్పనిక కవులు ఏదో ఒక విధానాన్ని మాత్రమే పట్టుకొని వ్రేలాడే తత్త్వం కలవారు కారు. ఎప్పటికప్పుడు ఏదోఒక పరిణామ శీలంకలవారు వారు. తమ జాతీయ ఆచారాలకు, సంప్రదాయాలకు తగ్గట్టుగా భావాన్ని మలుచుకోగల సమర్థులు. అందుకే ఏ పత్రికా ప్రకటనలూ,కార్యక్రమాల హడావిడి, సిద్ధాంతాల రాద్ధాంతాలు వారికి లేవు. కీట్సు తన లేఖలలో రసతత్త్వ వాఖ్యానాలను **(aesthetic comments)** ప్రకటించాడు. వర్డ్స్‌వర్త్ రాసిన **'Preface to the lyrical ballads'**, కోలరిజ్ రచించిన **'Biographia Literaria'** షెల్లీ రాసిన **'Defence of Poetry** అనేవి తరువాత రచించినప్పటికీ వెనకటి కవిత్వాన్ని గూర్చి క్షుణ్ణంగా పరామర్శిస్తాయి. అంతేకాదు. ఆంగ్లకవుల కాల్పనికత్వస్థాయినీ, దృక్పథాన్నీ అవి ప్రకటిస్తాయి.

అలాగే జర్మనీలో ఫ్రెడరిక్ సెలెగల్ చేసిన కాల్పనిక కవిత్వపు సూత్రీకరణలో **'Athenamm'** అనే పదానికి ఒక క్రొత్త వ్యాఖ్యానం కనిపిస్తుంది. కాల్పనిక కవిత్వమనేది “అభ్యుదయాత్మకమైన విశ్వజనీన కవిత్వం” **(Progressive Universal Poetry)** గా పరిగణించబడింది.. “ప్రతినిత్యం విడివిడిగా కనబడే దృశ్యాలను తత్త్వశాస్త్రంతో, భాషాశాస్త్రంతో ఆ కవిత్వం సమైక్యపరుస్తుంది.

పద్యగద్యాలనూ, ప్రతిభనూ, విమర్శనూ, సహజమైన కళాత్మక కవిత్వాలను ఒకదానితో ఒకటి కలుపుతుంది. కవిత్వాన్ని సజీవంగా, సాంఘికంగా, జీవితానుకూలంగా చమత్కారం పనికి వచ్చే ప్రతి విషయంతోనూ కలగలిపి కళాఖండాలను రూపొందిస్తుంది." అని ప్రకటించబడింది. **(Romanticism - P.42).** ఆనాటి లోకానికి ఒక **Classic** కాల్పనిక కవిత్వం అద్దం పట్టింది. తత్త్వశాస్త్రంలో హాస్యం, జీవన విధానంలో సాంఘిక తత్త్వం, స్నేహం, ప్రేమలాగా కళలో కాల్పనిక కవిత్వం ఎన్నబడింది. మొత్తం మీద జర్మనీలో ఇది చాలా తీవ్ర స్థాయికి చేరింది.

అదేవిధంగా ఫ్రాన్సులో కూడా ఈ ఉద్యమం ముఖ్యంగా రాజకీయ మతసంబంధమైన సంఘర్షణలు పెక్కింటితో ముడిపడిఉంది. ఫ్రెంచి కాల్పనికులు వీలయినంతవరకూ తమ ఆత్మీయతకూ, ఆకస్మికంగా కలిగిన అనుభూతికీ ప్రాముఖ్యమిచ్చారు. రూపక నిర్మాణంలో, వక్తృత్వంలో వాస్తవికతకూ, సహజగుణానికీ విలువనిచ్చారు. అయితే ఫ్రెంచి కాల్పనికులు క్రొత్త విషయాలపై దృష్టి సారించగల ధైర్యవంతులుకారు. వారి దృష్టినంతా ముఖ్యంగా వెనుకవైపునకూ, తమ ప్రేరణకు వ్యతిరేకమైన రచనలపైనా కేంద్రీకరించారు. అంతేకాదు. సృజనాత్మక భావుకతపై వారికంత మక్కువలేదు. దాంతో వారి సంస్కరణలన్నీ పద్యం, నాటకం అనే రెండింటికి చెందిన సాంకేతిక పరమైన స్వేచ్ఛపైనే కొనసాగించబడినాయి.

అందుకే ఫ్రెంచి కాల్పనికులు నిజంగా ఆంతరికజగద్విషయాలకన్నా బాహ్యలోకవిషయ పరిష్కారానికే అన్వేషణ జరిపారని 'బాడ్‌లేర్' విమర్శించాడు. **(Ibid - P.48)**

## కాల్పనిక భావుకత (Romantic Imagination)

కాల్పనిక కవుల్ని అంతకు ముందున్న కవులనుండి వేరుచేసే ప్రత్యేక గుణమే ఈ భావుకత లేదా ఊహాశక్తి **(Imagination)**. ఈ ఊహాశక్తికే బ్లేక్, కోలరిజ్, వర్డ్స్‌వర్త్, షెల్లీ, కీట్సు ప్రభృతులు కట్టుబడి ఉన్నట్లు కనిపిస్తుంది. 18వ శతాబ్దంలోని కవితా సిద్ధాంతంలో నిజానికి ఊహాశక్తి అంత ముఖ్యమయిందికాదు. డ్రైడెన్‌కు లాగా పోప్, జాన్‌సన్‌లకు కూడా ఊహాశక్తిఅంత

ప్రాముఖ్యమున్న విషయం కాదు. వారి దృష్టిలో కవి అనేవాడు అనుకరణ చేసేవాడుకాని స్రష్ట కాదు. **(an interpreter than a creator)** అంతేకాదు. జీవితంలో మనకు తెలిసిన విషయాల్లను ఎంతబాగా ఆసక్తిదాయకంగా ప్రకటిస్తున్నామా అనే దృష్టితప్ప ఆనాటి కవులకు అద్భుతమైన విషయాల ప్రసక్తి అంతగా ఉండేది కాదు.

అయితే కాల్పనిక కవులకు ఊహాశక్తి లేదా భావుకత అనేదే మూలమయింది. భావుకత లేనిది కవిత్వమే లేదని వారి నమ్మకం. ఆ ఊహాశక్తివల్లనే తాము కవులమయ్యామనీ, ఆ శక్తివల్లనే తాము మిగిలిన వారికన్నా గొప్పగా కవిత్వం రాయగలుగుతున్నామనీ వారు అభిప్రాయపడ్డారు.

సృజనశక్తి నిరాటంకంగా కొనసాగినవుడు కవిత్వం దృఢతరమవుతుందని కాల్పనికులు భావించి నిరూపించారు. కళలలో అనూచానంగా వచ్చే జీవన విధానాన్ని ఉత్సాహభరితమైన సాహస కృత్యాలకు వారు వినియోగించారు. 'రినైజాన్స్' లో వలె కవులు మానవాత్మను కళల్లో ప్రకటించవచ్చునీ, అది జీవితానుకరణం కన్నా చాలా విలువయిందనీ కాల్పనికులు కనుగొన్నారు. అంతేకాదు. స్వీయశక్తుల ద్వారా సంపూర్ణమైన ఆత్మవికాసాన్ని పొందవచ్చునీ, క్రొత్త ఆలోచనాలోకాలను రూపొందించవచ్చునీ భావించారు.

అందుకే ఒక విమర్శకుడు – **'What is really meant by the name of the romantic movement, is simply the reawakening of the imagination, a reawakening to a sense of beauty and strangeness in natural things, and all the impulses of the mind and the senses'. (Romantic movement in English poetry - Arthur Symons (1909) P.17)** అని వ్యాఖ్యానించాడు.

దాంతో కాల్పనికులు ఊహాశక్తికిచ్చే ప్రాముఖ్యం మతపరంగా, భౌతిక వస్తుపరంగా కూడా బలపడింది. కాని లాక్, న్యూటన్ ప్రతిపాదించిన సిద్ధాంతాలను పూర్తిగా వారు అంగీకరించలేదు. కాల్పనికులకు హేతువుకన్నా అనుభూతీ, వాదంకన్నా అనుభవం ముఖ్యం. యంత్రనిర్మాణ నైపుణ్యం ఉన్నవ్యక్తి చేసిన వ్యాఖ్యలు ఆంతరంగిక విశ్వాసాలకు తగవని వారి అభిప్రాయం. బ్లేక్, కోలరిజ్ అనే వారిద్దరూ 'లాక్' చెప్పిన భగవంతుడూ, కవిత్వం అనే విషయాలను సమర్థించినప్పటికీ, ఈ లోకానికి సంబంధించిన అతడి అభిప్రాయాలతో వారు

ఏకీభవించలేదు. వాటి స్థానంలో తమ 'ఆదర్శవాదాన్ని' ప్రవేశపెట్టారు. వారి దృష్టిలో మేధస్సే కేంద్రబిందువు, పరిపాలనాంశం. దాని ముఖ్య కార్యక్రమం భావుకత. అది ఒక దైవశక్తి. దానిని ఉపయోగించడం అంటే ఒక దైవకార్యక్రమంలో పాల్గొనడమే.

బ్లేక్ : అందుకే బ్లేక్ మహాగర్వంగా "ఊహాప్రపంచమే శాశ్వతలోకం. మరణానంతరం మనస్థూల దేహంపొందే దేవతా హృదయం అదే. ఈ ఊహా ప్రపంచం అనంతం, శాశ్వతం. జగత్సృష్టి లేదా వృక్ష సంపద అంతమవుతుంది. అది తాత్కాలికం. మనం చూసే ప్రతి వస్తువునకు సంబంధించిన శాశ్వత సత్యాలన్నీ ప్రకృతి పరమైన, వృక్ష సంబంధమైన అద్దంలో ప్రతిబింబిస్తూ ఆ శాశ్వత లోకంలో ఉంటాయి. అన్ని పదార్థాలూ శాశ్వతమైన రూపాలలో భగవత్సంబంధమైన తత్త్వంలో మానవ ఊహాశక్తిలో కలిసి ఉంటాయి" అని ప్రకటించాడు. **(A Vision of the last judgement in poetry and prose of William Blake - Gloffrey Keynes I Vol. 4th edn. London - 1939. p. 639).**

భావుకత అనేది భగవంతుడు మానవాత్మలో కలిగించేది కాబట్టి అది దేవుని కన్నా ఏమాత్రం తక్కువకాదని ఆతడి నమ్మకం. ఊహాశక్తితో సృజించిన రూపమేదైనా దైవ సంబంధమైనదేననీ భావుకతలో మానవుని దైవస్వభావం పూర్తిగా ప్రకటితమవుతుందనీ ఆయన అభిప్రాయం.

అయితే కోలరిజ్ ఆ విషయాన్ని అంత నొక్కి చెప్పకపోయినా బ్లేక్ అభిప్రాయాన్ని పూర్తిగా కొట్టిపారెయ్యలేదు. అందుకే "నేను వహించే ప్రాథమికమైన ఊహాశక్తి ఒక సజీవ శక్తిగా, మొత్తం మానవజ్ఞానం యొక్క ప్రతినిధిగా, అనంతమైన 'అహం'లో పరిమితమైన మేధాసంబంధమైన ఒక శాశ్వత సృజన శక్తిగా ఉంటుంది' అని ఆతడు చాటి చెప్పాడు. **(Samuel Taylor Coleridge - Biographia Literaria - ed by J.S. Shaneross - (2 Vol - Oxford - 1907) I - P.202)** వాస్తవానికి కవిత్వమనేది మాధ్యమికమైన ఊహశక్తినుండి జరిగే ఉత్పత్తిగా కోలరిజ్ భావించాడు. కాని స్థాయిలో మాత్రమే ఇది ప్రాథమికమైన దానికి భిన్నంగా ఉంటుంది. భగవంతుడి సృజనా కార్యక్రమంలో భావుకత ఉంటుంది. కాబట్టి కోలరిజ్ దృష్టిలో ఇదే మొదటి ప్రాముఖ్యమైన విషయం.

ఈ అభిప్రాయం బ్లేక్, కోలరిజ్‌లకు మాత్రమే పరిమితంకాలేదు. వర్డ్స్‌వర్త్, షెల్లీ, కీట్సులచే కూడా ఏదోకొంత స్థాయిలో ఇది స్వీకరించబడింది. భావుకతను ఒక అమూల్యమైన వ్యక్తిగత సంపదగానే కాక, ఒక మానవాతీతక్రమం **(Super natural order)** గా వీరిలో ప్రతి ఒక్కరూ విశ్వసించారు. అంతకు పూర్వం ఎప్పుడూ ఇలాంటి అభిప్రాయంలేదు. నిజానికి ఈ మంత్రశక్తివల్లనే కాల్పనిక కవిత్వం ఆవిర్భవించింది అంతేకాదు. కాల్పనికులు స్వీయలోకాలను సృజించుకొన్నప్పటికి, అవి అసంబద్ధంకానీ, కేవలం కల్పితం కానీ కావని ఇతరులను ఒప్పించడంలోకూడా వారు కృతకృత్యులయారు.

ఈ విషయంలో జర్మను కవులకన్నా ఆంగ్లకాల్పనికవులు చాలా ముందంజ వేశారు. ఊహాశక్తిని సత్యానికీ,వాస్తవానికీ ఒకముఖ్యసంబంధంగా వారు విశ్వసించారు. తమ కవిత్వమంతా దానిపైనే కేంద్రీకృతమయేటట్లు చేయడానికి వారు చాలా శ్రమ పడ్డారు.

ఏమైనప్పటికీ ఊహాశక్తి అనేది ముఖ్యసమస్యలకు సంబంధించిన దైవత్వమని నమ్మడం నిజానికి కష్టమే. బేకన్‌వంటివారు చెప్పినట్లుగా ఏకవి అయినా ఆతడు సృజించిన దంతా ఊహా సంబంధమైనదని అనడం హాస్యాస్పదమే. కవిచేసిన కల్పనంతా పూర్తిగా నిరాధారంగా కాక వాస్తవానికి కొంత సన్నిహితంగా ఉంటుంది. సాధారణంగా కవులు తాము సృజించిన విషయాలు ఏదో విధంగా సత్యానికి సంబంధించి ఉన్నాయనే నమ్ముతారు. ఈ నమ్మకమే వారిని ముందుకు నడిపిస్తుంది. నిజానికి వారి విధానం విశ్లేషణాత్మక మేధా సంబంధం **(Relating to analytical mind)** కాదు. అయితే సూక్ష్మబుద్ధికన్నా అది ఏమాత్రం తక్కువకాదు. కవిత్వమనేది సత్యానికి ఏదో విధంగా చెందిఉండవచ్చుకాని ఆసత్యం శాస్త్రానికీ, తత్త్వానికీ వేరైందికావచ్చు. అందుకే **Theseus** కు సమాధానంగా ఊహాశక్తిని గూర్చి షేక్స్పియర్ **Hippolyta** అనేపాత్ర ద్వారా

**"But all the story of the night told over
And all their minds transfigurd so together
More witnesseth than fancy's images
And grows to something of great contrancy
But, howsoever, strange and admirable"**

అని చెప్పిస్తాడు. (A Midsummer Night's dream - Act V - Scene I)

ఈ విషయం " కవిత్వ ప్రకటనలన్నీ సాహిత్యపరంగా నిజంకావు కాని ప్రతీకాత్మకంగా సత్యాలు" ('The statements of poetry are true not literally but symbolically' W.H.Woodward, Vittorinodo Feltre (Ferenze) - 1923 - P.175) అని Guarino చెప్పిన అభిప్రాయానికి కొంత దగ్గర. Hippolyta దృష్టిలో ఊహాశక్తివల్ల చేసిన సృజన మొత్తం సజీవానుభవాలకు చెంది ఏదోరకంగా వాస్తవాన్ని ప్రతిబింబిస్తుంది.

కాల్పనికులు ఈ సమస్యను చాలా ధైర్యంగా సూటిగా ఎదుర్కొన్నారు. ఊహ అనేది లోకంలో ఉండని (non-exist) వాటిని గూర్చి చెప్పినప్పటికీ, అది ఒక ముఖ్యమైన సత్యాన్ని బయటపెడుతుందని వారు గట్టిగా వాదించారు. ఊహపనిచేసేటప్పుడు సాధారణ వివేకానికి గోచరించని ఎన్నో విషయాలను దర్శించగలుగుతామనీ, ఆంతర దృష్టికి లేదా వివేకానికి లేదా ఆంతరంగిక జ్ఞానానికి భావన చాలా సన్నిహిత సబంధం కలిగి ఉంటుందనీ కాల్పనికులు విశ్వసించారు.

వాస్తవానికి ఊహాశక్తి, ఆంతర దృష్టి అనే రెండూ విడదీయరానివి. ఆంతర దృష్టి ఊహాశక్తిని పనిచేయడానికి మేల్కొల్పుతుంది. అంతేకాదు. అది పనిచేసేటప్పుడు దానిని క్రమంగా సునిశితంచేస్తుంది. ఈ అభిప్రాయమే కాల్పనికులచేత కవిత్వాన్ని రాయించింది. వస్తువులలోని రహస్యాలను పరిశోధించి, వాటిని ఊహారూపాలుగా తీర్చిదిద్దడానికి వారికా ఊహాశక్తి ఒక ప్రేరణ నిచ్చింది. అందుకే వారు ఊహనూ సత్యాన్ని కలగలుపుతారు.

**కోలరిజ్** : ఈ సందర్భంలో కోలరిజ్ మహాశయుడు వర్డ్స్‌వర్త్‌ను కొనియాడుతూ "లోతైన ఆలోచనతో లోతైన అనుభూతి, పరిశీలనలో సమతూకంగల సత్యం, పరిశీలించిన విషయాలను ఊహాశక్తితో తీర్చిదిద్దే తత్త్వం ఇవన్నీ కలగలిసి ఖ్యాతినితెచ్చే సహజ సిద్ధమైన ఒక వరం భావన. దానితో పరిస్థితుల చుట్టూ వున్న ఆదర్శలోకపు నిమ్నోన్నతులను, రూపాలనూ, సంఘటనలను కనుగొన వచ్చు. అయితే సాధారణ దృష్టికి సంప్రదాయం కాంతిని కప్పివేసినట్లూ, నిప్పు కణాన్ని చల్లార్చినట్లూ, మంచు బిందువును

ఆరబెట్టినట్లూ అనిపిస్తుంది" అని చెప్పిన వాక్యాలు ఉదాహరణ ప్రాయాలు. **(Coleridge Biographia Literaria - I P.59)**

కాల్పనికులు వస్తువుల లోనికి చూచే అంతరదృష్టికి ప్రాముఖ్యమివ్వడంవల్ల లాక్ మహాశయుడు చెప్పిన భౌతిక విషయాలకున్న జ్ఞానపరిమితిని తిరస్కరించారు. ఈ సందర్భంలో "శారీరకమైనవిగా పిలవబడే మానసిక విషయాలు మాత్రమే వాస్తవాలు. వాటి నివాసం ఎవరికీ తెలియదు. అది అంతా ఒక భ్రాంతి, దాని స్థితి ఒక వంచన. మేధస్సుకూ లేదా ఆలోచనకు వెలి అయిన జీవిత మెక్కడుంది ? వివేకహీనుని మేధస్సులోనా ?" అని బ్లేక్ అన్న మాటలు పేర్కొనదగ్గవి. **(A vision of the Last Judgement in Poetry and Prose - P.651)**

మరి ఏ ప్రత్యేక కారణాలు లేకపోయినా కోలరిజ్ కూడా ఇదే అభిప్రాయానికి వచ్చాడు. "మేధస్సు అనేది సాధ్యమయిందికాదు. భగవంతుడిచే నిర్మించబడ్డ ఒక బొమ్మ అదీ పూర్తిగా సృష్టికర్త బొమ్మ అనే ఒక ఉన్నతమైన భావంతో తయారయింది అది. అయితే మేధస్సు యొక్క మానసికత మీద నిర్మించబడిన ఏ విధానమైనా అసత్యమయింది అనే అపోహకు ఇక్కడ అవకాశం ఉంది" అంటాడు ఆయన **(Letters of Samuel Taylor Coleridge, ed by Ernest Hartley Coleridge (2 vols), London 1895) I.P. 352)**

బాహ్య ప్రపంచానికి సంబంధించి బ్లేక్, కోలరిజ్‌లు ఇద్దరూ 'లాక్' కు అంగీకారయోగ్యంకాని దైవత్వపు ఆధిక్యతను స్థిరపరచడానికి పూనుకున్నారు. ఆ విషయం అప్పటికే జర్మనీ దేశపు భౌతిక వస్తు శాస్త్రజ్ఞుల **(meta physicians)** చే ప్రతిపాదించబడింది. కాని ఆ సంగతి బ్లేక్‌కు తెలియదు. ఆతడు చేసిన నిర్ణయాలన్నీ ఆతడి స్వీయ దృశ్య ప్రపంచం నుండి పుట్టినవే ! అలాగే కోలరిజ్ కూడా దేవలోకం ఆంతరిక జీవితం యొక్క గాఢానుభూతి నుండి జనించిందని విశ్వసించాడు. అంతరజ్ఞానంతో కలిసి పనిచేసే ఊహాశక్తి మనకు సంబంధించిన విషయాలను అన్వేషించడానికి విశ్లేషణాత్మక హేతువుకన్నా అధికంగా ఉంటుందని ఆయన నమ్మాడు. కోలరిజ్ ఈ విషయాలను **Kant**

నూ, Schelling ను గూర్చి అభ్యసించిన తరువాతనే కనుగొన్నాడు. అయితే దేవలోక మొక్కటే సత్యమయిందనే ఆతడి దృఢ విశ్వాసం నుండి ఈ అభిప్రాయాలు కలిగాయని చెప్పాలి.

లాక్, న్యూటన్‌లు అనుభూతి ప్రపంచాన్ని గూర్చి వివరించారు కాని అది దేనికి పనికి వస్తుందో చెప్పలేదు. అయితే కాల్పనికులు దేవతా సంబంధమైన విషయాలకు చెందినవారు కాబట్టి ఊహాశక్తిని ప్రేరేపించే ఆంతరదృష్టి ద్వారా వాటిని అర్థం చేసుకొని, ఉత్తమమైన కవిత్వంలో ప్రదర్శించడానికి ప్రయత్నించారు. అంతేకాదు. ఆంగ్ల కాల్పనికులు జర్మనీవారిలా కాక తృప్తికరమైన సమాధానాలు దొరికే వరకూ ఊహాశక్తిని గూర్చి అన్వేషించారు. హేతు సంబంధమైన మేధస్సు (Logical mind) ను కాక, అనుభూతులూ, ఉద్రేకాలు మొదలైనవి ఉన్న వివేకవంతమైన ఒక సంపూర్ణాత్మను వారు కావాలనుకున్నారు. వ్యక్తిగతమైన ఊహానుభవ ప్రదర్శన మాత్రమే దీనిని సాధిస్తుంది. వర్డ్స్‌వర్త్ ప్రకృతిలోనూ, షెల్లీప్రేమలోనూ కనుగొన్న అతీత శక్తులు వారిచ్చిన సూచనల్లో, ఉదాహరణల్లో ప్రకటితమవుతాయి. అయితే ఆంతరికంగా పనిచేసిన అదృశ్యశక్తులవల్ల రూపొందిన స్వరూపాలను వర్ణించడానికిగానీ, విశ్లేషించడానికిగానీ కాల్పనికులు ఒప్పుకోరు. కాబట్టి వారు ప్రదర్శించిన ప్రత్యేకమైన సందర్భాలను పరిశీలించి, వారి ఊహాశక్తితత్వాన్ని మనం బేరీజు వేసుకోవలసిందే!

అంతేకాదు “కళ సార్వత్రిక సత్యాలకు సంబంధించినది” **(Art deals with general truths)** అనే అభిప్రాయాన్ని బ్లేక్ ఖండించాడు. ఆయన తన కాల్పనిక లోకంలో విహరిస్తూ, ఏది కూడా ఒక ప్రత్యేక రూపంలో కనబడితే తప్ప పూర్తి ప్రాముఖ్యాన్ని సంతరించుకోదని అభిప్రాయపడ్డాడు.

ప్రతి సంఘటనకు చెందిన సంఘటితతత్వం, నిరాడంబరత్వం అనేవాటిని సాధ్యమైనంత వరకూ పెద్ద సమస్యలకు కూడా జోడించాలని కాల్పనికుల లక్ష్యం. అందుకే వారు కవిత్వంకోసం మారుమూలగా ఉన్న క్రొత్త ఇంద్రియాతీతానుభవాన్ని అన్వేషించారు. అంతేకాక, ఆ అనుభవాన్ని కొన్ని

ప్రత్యేకమైన సందర్భాలలో, ఉదాహరణలలో మాత్రమే ఇతరులకు అందించడం బాగుంటుందని వారు నిశ్చయించుకొన్నారు.

ఈ లోకాన్ని నడిపే అదృశ్యశక్తులే దృశ్య ప్రపంచంలో కూడా పనిచేస్తాయి. సాధారణంగా మనం దర్శించగలిగిన, వినగలిగిన వాటితోనే సంబంధం పెట్టుకుంటాం. అయితే ప్రతికవీ తన అనుభూతి లోకంలో విహరిస్తాడు. కాని కాల్పనికులకు ఈ లోకం, వారి దృశ్యశక్తులను పనిచేయించే ఒక సాధనం మాత్రమే. బ్లేక్ తాను చూచిన విషయాలనే వర్ణిస్తాడు. ఏదో ఒక ముఖ్య ప్రయోజనాన్ని ఆశిస్తూ. ఒకపెద్ద రహస్యాన్ని బయటపెడుతూ చేసే వర్ణనల్లో అతడి మాటలెంతో విస్పష్టంగా ఉంటాయి. ఆ సందర్భంలో ఆతడు ఉపయోగించిన ప్రతీకలు చాలా కాంతి వంతంగా కనబడతాయి. అలాగే కోలరిజ్ స్వప్నావస్థలో, తాదాత్మ్య స్థితిలో గొప్ప ప్రేరణను పొందినప్పటికీ, వాటిని వివరించే సందర్భంలో మాత్రం వివేకవంతమైన సూచనలనూ, గుణాలను ఆతడు తెలియజేశాడు. అదేవిధంగా షెల్లీ ఊర్ధ్వలోకపు ఆలోచనలూ, మానసిక విషయాల మధ్య ఊగిసలాడినప్పటికీ దృశ్యలోకంలోనే సహజ సిద్ధంగా ఆతడు విహరించాడు. పూర్తిగా స్వప్నలోకంలోనే ఉంటూ, తెలిసిన దృశ్యాన్ని అరుదుగా గుర్తించే కవులున్నారు. కాని కాల్పనికులు ఆకోవకు చెందినవారుకారు.

కాల్పనిక కవులందరూ తమ మొదటి ప్రేరణను ప్రకృతి నుంచే పొందారు. ప్రకృతిలేకపోతే వారికేమీ లేనట్లే. దృష్టినుండి దృశ్యానికీ, తరువాత లోక రహస్యాలకూ కేంద్రీకరింపజేసి పరవశించే లక్షణాలను వారు ప్రకృతి ద్వారానే కనుగొన్నారు. అందుకే సాధారణమైన ప్రకృతి ముఖంపై ఒక వినూత్నమైన, అద్భుతమైన కాంతిని ప్రసరింపజేసి, అది వెలువరించే ఆకర్షణను వ్యాఖ్యానించి, మనల్ని ఆకట్టుకునేశక్తి కాల్పనికులకున్నదనడంలో సందేహంలేదు.

"The English romantics read in the book of Nature, only those pages which confirmed their own dogmas. Most of them described to know the unity of sprit, the infinite, that in which all the forms of being are one. Therefore they wrote of nature scarcely individualized into separate forms, the bare inifinity

of the bells the sea, the desolation of the salt marshes and moulded it to express the movement of a single spirit in infinite space. They described a spiritual reality transcending Nature, and therefore they chose those aspects of Nature where the appeal to the senses is least compelling." (The Romantic theory of Poetry - A.E. Powell (Mrs. E.R. Dodds (1926) - P. 44)

కాల్పనిక కవులందరూ ఏదో అంతరంగిక సత్యాన్ని నమ్మి, తమ కవిత్వమంతా దాని మీదనే ఆధారపడేటట్లు చేసినా, దానికి సంబంధించిన వివిధ మార్గాలను అన్వేషించి, విభిన్న ప్రయోగాలు చేశారు. వారికి చెందిన దృశ్యప్రపంచానికీ, దానికి వారిచ్చే అర్థానికీ ప్రాముఖ్యం చూపే స్థాయిలో మాత్రం వారు భేదం చూపించారు.

"ఊహాశక్తి ఒక దైవశక్తి. సత్యమైన ప్రతి వస్తువూ దానినుండే వస్తుంది' ' అని ప్రకటించిన బ్లేక్ ప్రకృతి అదృశ్యమైనప్పుడు ఆశక్తి స్వయంగా సృష్టించగల స్వేచ్ఛను పొందుతుందని నమ్మాడు. దృశ్యపదార్థంచే కప్పబడ్డ వాస్తవాన్ని ఊహాశక్తి బయటపెడుతుందని బ్లేక్ దృఢ విశ్వాసం.

అందుకే

'To see a world in a grain of sand
And a Heaven in a world of Flower
Hold Infinity in a palm of your hand
And Eternity in an hour.

అని ప్రకటించాడు ఆయన. **(Auguries of Innocence in poetry and prose P.118)** ఈ వాక్యాలు మొత్తం కాల్పనికతత్త్వానికి అద్దంపడతాయి. దృశ్య వస్తువుల ద్వారానే బ్లేక్ ఇంద్రియాతీత స్థితి **(Transcendent state)** కి చేరాడు. దాన్ని ఆతడు "శాశ్వతత్వం" **(Eternity)** అని పిలిచి స్వేచ్ఛగావినూత్న సజీవలోకాలను సృజించాడు. దేవుడి కోసం గ్రుడ్డిగా శ్రమ పడుతూ పెనుగులాడే మార్మికకవి **(Mystic Poet)** కాడాతడు.

"ఆహోరాత్రాలు భగవత్సన్నిధిలో ఉన్నాను నేను
ఆయనెప్పుడూ విముఖుడు కాడునాకు"
(I am in gods presence night and day

And he never turns his face away - Blake, Fragment in Poetry and prose - P - 128) అని ప్రకటించే తత్త్వం ఆతడిది. కాల్పనిక కవులందరిలోనూ బ్లేక్ భావనా సిద్ధాంతంలో చాలా గట్టివాడు. "దైవదృష్టి అయిన భావనా శక్తి ఒక్కటే కవిని చేస్తుంది" అని ఆయన గట్టి నమ్మకం (One power makes a poet, Imagination, The Divine vision - Blake, Annotations to Wordsworth's poems in poetry and prose - P. 82) దృశ్యలోకంవైపు ఆతడు తన దృష్టిని సారించినా, ఆతడి ప్రత్యేక సంబంధమంతా అదృశ్యలోకంతోనే. సజీవమైన ప్రతివస్తువూ ఆతడికి శాశ్వత శక్తులున్న ఒక ప్రతీకయే. దానితోనే అన్నింటినీ ఆతడు అర్థం చేసుకోదలచాడు. ఆతడొక గొప్ప చిత్రకారుడు. అందుకే దృశ్యలోకపు భాషలో అదృశ్యలోకాన్ని వర్ణించగలిగాడు. దానినాతడు తన ఆంతరంగిక శక్తితో దర్శించగలిగాడు. సజీవమైన వస్తువులన్నింటిలో పనిచేసే దైవసంబంధమైన ఒక వాస్తవిక శక్తియే ఆతడి గొప్పశక్తులన్నింటినీ బహిర్గతం చేసింది. అతిసామాన్యమైన సంఘటన కూడా ఆతడికి పాఠాలతో, అర్థాలతో పరిపూర్ణమయిందే ! ఆతడు తాను దర్శించినదంతా 'Auguries of Inncence' లో ప్రదర్శించాడు. పురాణ సంబంధమైన దైవతత్త్వబోధక ద్విపదలలో ఈ దృశ్యలోకాన్నీ ఆదైవలోకాన్నీ ఒకే సంపూర్ణత్వంలో బంధించగలిగాడు ఆతడు. అందుకే ఆతడి మాటలు చాలా చిన్నగా కనబడినా ప్రతీదీ చాలా శ్రద్ధగా పరిశీలించదగిందే !

'A Robin Red breast in a Cage
Puts all Heaven in a Rage'

అని చెప్పినప్పుడు 'robin red breast' అనేది కనబడే ఒక పక్షికాదు. స్వయంగా దైవత్వంగల ఒక వస్తువు. అయితే ఆ పక్షి ప్రతీకాత్మకంగాఉండి, ఆనందపరిచే ఒక స్వేచ్ఛా ప్రవృత్తిని పద్యమంతటా నింపుతుంది. సాధారణమైన వస్తువులు సహజంగా అసంపూర్ణాలైనా, అవి నిజానికి గొప్ప ప్రతీకలని నమ్మిన

ఒక గొప్పద్రష్ట బ్లేక్. పదార్థపు కఠినత్వానికి బాధపడక, అందులో సహజసిద్ధంగా స్వయంశక్తితో ఉన్న మరో రకమైన శాశ్వత విలువలనూ సజీవ శక్తులనూ దర్శించాడు ఆతడు.

**కీట్స్** : కీట్సుకు దృశ్య ప్రపంచం మీద బ్లేక్ కన్నా ఎక్కువ ప్రేమ. కాల్పనికాభిప్రాయాలకోసం జీవించిన వ్యక్తి ఆయన. అయితే ఊహాశక్తితో మాత్రమే సంపూర్ణ సత్యాన్ని దర్శించగలమనే అభిప్రాయంలో బ్లేక్‌వంటి వాడే కీట్సు. 'Sleep and Poetry' లో కొన్ని పంక్తుల్లో ఆయన అంత స్పష్టంగా చెప్పక పోయినా, ఊహాశక్తి అనేది ఒక సృజన లేదా ఒక వ్యక్తీకరణ శక్తి అని అభిప్రాయపడినట్లు స్పష్టమవుతుంది. ఊహాశక్తిచేసే పనులూ, ప్రసరించే కాంతీ, శాశ్వత సత్యానికి చెంది ఉంటాయని ఆయన నమ్మకం. ఇంద్రియానుభూతివల్ల సౌందర్యారాధన చేసే ఒక అసాధారణ సత్యాన్ని తన ఊహాశక్తితో అన్వేషించాడు కీట్సు. ఆ భావచిత్రాలు ఆతడిని కదిలించి, మరో లోకానికి తరలించి ఒక దివ్యానుభూతిని అందించాయి. ఆయన దృష్టిలో ఈ ప్రపంచమంతా ఒక్కటే. ఆయన భావనాశక్తిని దృష్టి, స్పర్శ, ఘ్రాణం అనే ఇంద్రియాలు మేల్కొల్పాయి. ఎన్నో సమస్యలున్న మరో గోళానికి చేర్చాయి. సౌందర్యం ద్వారా శాశ్వత సత్యం ప్రత్యక్షమైనట్లు ఆయన భావించాడు. తద్వారా ఒక అతీతమైన తాదాత్మ్యస్థితిని పొందాడు. అందుకే సౌఖ్యమనేది మన మనస్సులలో దాని సారంనింపి 'రసమయస్థితిగల దూరాకాశం'లో మనలను విడిచిపెడుతుందని ఆయన ప్రకటించాడు.

'Feel we these things ? that moment we have slept
Into a sort of oneness, and, our state
Is like a fleeting sprit. But there are Richer entangle-
ments, inthralments far
More self - distroying, leading by
To the chief intensity'

*- End yomion, I - 775-800*

అయితే బ్లేక్ ఊహాశక్తి active, కీట్సు ఊహాశక్తి passive, జీవితాన్ని సృజించి పెంపొందించే అన్ని కార్యక్రమాలూ ఊహాశక్తి నుంచే పుడతాయని బ్లేక్ అంటాడు. ఇంకా ఏదో ఒక ముఖ్యమైన శక్తి (Chief intensity) ని

పొందడమే తన లక్ష్యమంటాడు కీట్సు. బ్లేక్ ఒక తత్త్వవేత్తలా మాట్లాడతాడు. కీట్సు ఒక కవిలా సంభాషిస్తాడు. అయితే ఏదో లౌల్యం కలిగించి వశపరచుకొని ఒక అదృశ్యదైవస్థితికి ఊహాశక్తి మార్గం చూపుతుందనడంలో మాత్రం కీట్సు బ్లేక్‌కు చాలా సన్నిహితుడు.

కోలరిజ్ కూడా ఊహాశక్తిని గూర్చి చాలా చర్చించాడు. ఆయన రచించిన 'Biographia Literaria' లో ఊహాశక్తికి కొన్ని అధ్యాయాలు కేటాయించాడు. అయితే ఆయన యవ్వనంలోని ఊహాతత్త్వాన్ని పట్టుకొని వ్రేలాడినట్లనిపిస్తుంది. దానినుండి ఒక సత్యలోకాన్నీ, నిర్జీవమైన శీతల ప్రపంచాన్నీ (inanimate cold world) సృజించాడు ఆయన. అక్కడ వస్తువులు వస్తువులుగానే ఉండి నిర్జీవమవుతాయి. ఈ నిర్జీవ లోకాన్ని ఊహాశక్తిచే సజీవంగా చేయవచ్చు. అందుకే దీనిని విరోధాభాసచే సమర్థిస్తూ "ఈ బాహ్యలోకం వెలుగునీడలు కలగలిసిన ప్రకృతి దృశ్యం. అనుభూతి మేధస్సుగా అదీ రసమయమైన మేధస్సుగా మారడానికి దానిపై ప్రతిభ పనిచేయాలి" అంటాడు కోలరిజ్ (Letters of Samuel Taylor Coleridge - II P.450)

ఊహాశక్తి జీవితానికి ఒక చక్కని ఆకారం ఇస్తుందని కోలరిజ్ నమ్మకం. ఆయన దృక్పథం Dejection లోని కొన్ని పంక్తులు స్పష్టపరుస్తాయి.

"Ah! from the soul itself must issue forth
Alight; a glory, a fair luminous cloud
Enveloping the earth
And from the soul itself must there be sent
A sweet and potent voice, of its own birth
Of all sweet sounds the life and element"

కోలరిజ్ ఊహాశక్తికి సంబంధించిన విషయంలో బ్లేక్ అంతదూరంపోలేదు. బాహ్య ప్రపంచపు అస్తిత్వంచేత దానిని కొంచెం ఆటంకపరచాడు. అయితే భగవంతుడికి చెందిన ఒక సృజనాత్మక కార్యక్రమ నిర్వహణ ద్వారా తాను జీవితానికి ఒక అర్థం కనుగొనగలిగినట్లు చివరకాతడు విశ్వసించాడు. కాని కవిత్వాన్ని వ్యక్తీకరించే వాస్తవమైన చిట్టచివరి ఆలోచన వరకూ కోలరిజ్ పురోగమించలేదు. సృజనక్రియయే వస్తుతః ఒక 'tran-

scendental' అనీ, దానికన్నా మనం ఎక్కువగా కోరదగింది ఏదీ లేదనీ ఆయన భావించినట్లు 'Kubla Khan' రచన నిరూపిస్తుంది. అయితే 'The Ancient Mariner', 'Christabel' లను పరిశీలిస్తే వాస్తవానికి "జీవిత రహస్యాన్ని అందించడమే కవిత్వం పని" ("The task of poetry is to convey the mystery of life") అని కోలరిజ్ అభిప్రాయపడినట్లు కనిపిస్తుంది. జాగ్రత్ స్వప్నావస్థల మధ్య, సజీవ మానవులకూ పారలౌకిక శక్తులకు మధ్య ఉన్న ఒక స్థితిని ప్రతిపాదించే రెండు రకాలైన అస్పష్టకవిత్వపు ఆలోచన కోలరిజ్ ప్రతిభను కదిలించింది. ఒక తత్త్వవేత్తగా ఆయన ఏమి ఆలోచించినా, కవిగా మాత్రం ప్రపంచంలో పారలౌకిక శక్తులు పనిచేస్తాయనే అభిప్రాయానికి కట్టుబడి ఉన్నాడు కోలరిజ్. అదే అతడినొక నిరంతరాన్వేషిగా మార్చింది. దాంతో పూర్తిగా అర్థంకాని ఏవోకొన్ని శక్తుల చేత జీవితం పరిపాలింపబడుతుందనే ఒక రకమైన భయం కోలరిజ్‌ని ఆవహించినట్లనిపిస్తుంది. ఫలితంగానే ఏ కాల్పనిక కవీ రాయని రహస్యం, తీవ్రత, ఆత్మీయత ఉన్న ఒక ప్రత్యేకమైన తరహాగల కవిత్వం కోలరిజ్ కలంనుండి వెలువడింది.

**వర్డ్స్‌వర్త్ :** వర్డ్స్‌వర్త్ ఊహాశక్తిని గూర్చి ముఖ్యంగా దానిలో కల్పన (Fancy) కున్న ప్రాముఖ్యాన్ని గూర్చి కోలరిజ్‌ని చాలా వరకూ ఒప్పుకున్నాడు. ఊహాశక్తి అనేది కవికున్న ఒక ముఖ్యవరమని వర్డ్స్‌వర్త్ అభిప్రాయం. 'Poems of Imagination' అనే భాగంలో సృజనాత్మక శక్తినీ, ప్రత్యేకమైన ద్రష్టత్వాన్నీ (Visionary insight) మిళితం చేశాడు ఆయన. ఈ కార్యక్రమమంతా భగవంతుడిదే అనడంలో కోలరిజ్‌నే అంగీకరించాడు వర్డ్స్‌వర్త్.

'For feeling has to him imparted power
That through the growing faculties of sense
Doth like an agent of the one great Mind
Create, works creator and receiver both,
Working but in alliance with the works
Which it beholds.

- The prelude, or grouth of poets' mind - II 255-60-ed-by Ernest Deselin Conth (Oxford - 1928)

అయితే సృజన మాత్రమే చాలదనీ, అది ఒక ప్రత్యేకమైన ఆంతర దృష్టితో కలవాలనీ ఆయన విశ్వసించాడు. అందుకే ఊహాశక్తిని "అత్యంత శక్తికి ఒక మారుపేరుగా, స్పష్టతమమైన ఆంతర దృష్టిగా, అధికతమమైన మేధస్సుగా, తాదాత్మ్యస్థితిలోని హేతువుగా" ఆయన అభివర్ణించాడు (Ibid - XIV-P.190-92) ఇతర కాల్పనికులలాగా హేతువును నీచస్థితి కాతడు దిగజార్చలేదు. ప్రేరణాత్మకమైన ఆంతర దృష్టి వస్తుతః సహేతుకమయిందని ఆతడు నొక్కి చెప్పాడు. బాహ్యలోకానికి చెందిన అభిప్రాయంలో కోలరిజ్‌కన్నా భిన్నాభిప్రాయంకలవాడు వర్డ్స్‌వర్త్. దాని స్వతంత్ర ప్రతిపత్తిని అంగీకరించి, ఊహాశక్తి ఏదోరకంగా బాహ్యలోకానికి చెందిఉండాలనీ, దానికది లొంగి ఉండాలనీ ఆయన ప్రకటించాడు.

'A plastic power
Abode with me; a forming hand, at times
A local spirit of his own, at war
With general tendency, but, for the most,
Subservient strictly to external things
With which it communed' (Ibid-II P.362-369)

వర్డ్స్‌వర్త్ దృష్టిలో "బాహ్యలోకం మృతప్రాయంకాదు, సజీవమయింది. దానికొక ప్రత్యేకమైన ఆత్మఉంది. అది మానవాత్మకన్నా వేరయింది. ఆ ఆత్మలో ఐక్యమొందదానికే మానవుడు విశ్వప్రయత్నం చేస్తున్నాడు. అయితే అలా చేయకుండా తరచుగా ఆతడు తప్పించుకుంటున్నాడు. ఎందుకంటే పుట్టింది మొదలు చనిపోయేవరకూ మానవుడి ఆలోచనలను ప్రకృతి ప్రభావితంచేసి ఆతడి జీవితాన్ని తీర్చిదిద్దుతుంది." ఈ అభిప్రాయంతోనే వర్డ్స్‌వర్త్ బాహ్య జగత్తు వ్యక్తిగత మేధస్సుకూ, వ్యక్తిగత మేధస్సు బాహ్యజగత్తుకూ ఏవిధంగా తగి ఉన్నాయో చూపగలిగాడు. ఆతడికి ప్రకృతి ఒక ప్రేరణామార్గం. మానవశక్తి ఎంతశక్తిమంతమో అదీ అంతే. అందుకే దాని స్థితిని కొట్టిపారెయ్యలేక ప్రకృత్యాత్మ, మానవాత్మ ఒకేచోట కలిసే ఒక అత్యున్నతస్థితిని వర్డ్స్‌వర్త్ ఆశించాడు. కొన్ని సమయాల్లో తాను అనుభవించిన వస్తువుల ఏకత్వపు అర్థంలో, తన దృష్టిద్వారా ఆస్థితి ఏర్పడినట్లు భావించాడు ఆయన.

**షెల్లీ :** ఇక షెల్లీ మేధాశక్తి సమకాలీన కాల్పనికులకు అంతగా సంబంధంలేకపోయినా, ఊహాశక్తినీ, కవితా సిద్ధాంతంలో దానికున్నస్థానాన్ని ఒప్పుకోవడంలో మాత్రం అతడేం తక్కువకాదు. సృజనాత్మక స్వభావాన్ని షెల్లీ బాగా అర్థం చేసుకున్నట్లు 'Prometheus Unbound' లో కవిని గూర్చి ఒక spirit చేసిన స్వేచ్ఛా పోరాట శాలాన్ని గానం చేసింది. ('He will watch from dawn to gloom, The lake - reflected sun illume, The yellow bus in the ivy - bloom, Nor heed nor see, what things they be; But from these create he can, Forms more real than living man, Nursilings of immortality')

ఈ దృశ్యప్రపంచాన్ని కవి తరచుగా పట్టించుకున్నప్పటికీ స్వతంత్ర జీవులను సృజించే ఒక సామగ్రిగా మాత్రమే దానిని ఉపయోగించుకుంటాడని షెల్లీ అభిప్రాయపడ్డాడు. అంతేకాదు. హేతువు ఏదోరకంగా ఊహకు సంబంధించి ఉండాలని ఆయన ప్రకటించాడు. ఇది ఒకరకంగా వర్డ్స్‌వర్త్‌కు వ్యతిరేకమే. కవిత్వంలో వ్యతిరేకమైన వస్తువులుకూడా విశ్లేషణద్వారా దగ్గరవుతాయి. అందుకే కవిత్వం "ఊహాశక్తియొక్క వ్యక్తీకరణం" "(The expression of imagination)" అని షెల్లీ అన్నాడు. ఈ విషయంలో బేకన్, లాక్‌వంటి మేధావులను షెల్లీ అనుసరించినా, ఆయన నిర్ణయాలు వారికి పూర్తిగా భిన్నమయినవి. ఊహాశక్తి మానవుడి అత్యున్నతమైన కళ అనీ, దానిద్వారా ఆతడు గొప్ప శక్తుల్ని తెలిసికోగలడనీ షెల్లీ నొక్కి చెప్పాడు.

"The mind in creation is as a fading coal, which some invisible influence, like an inconstant wind, awakens to transitory brightness. . . when composition begins, inspiration is already on the decline, and the most glorious poetry that has ever been communicated to the world is probably a feeble shadow of the original conceptions of the poet"

*--Defence of Poetry.*

అంతేకాదు, ఊహాశక్తిని కవికున్న ప్రత్యేకమైన ఒక జ్ఞానంగా పరిగణించేవారి అభిప్రాయాన్ని ''వర్తమానాన్ని ఉన్నదిఉన్నట్లుగా జాగ్రత్తపడడంతోబాటు, కవి ప్రస్తుతంఉన్న విషయాలను ఏవిధంగా అమర్చాలో

తెలిపే సూత్రాలను కూడా అన్వేషిస్తాడు. అయితే ఆతడు వర్తమానంలో భవిష్యత్తును ఆలోచిస్తాడు. ఆతడి ఆలోచనలు పుష్పమూలాలు, సరికొత్త ఫలాలు . . . శాశ్వతమూ అనంతమూ ఏకత్వంలో కవి పాల్గొంటాడు" అని ఖండించాడు షెల్లీ (Defence of poetry in prose works of Percy Byshelly, ed by Harry Buxton Forman (4 Vols. Lendon, 1880) III-P.104)

షెల్లీ దృక్పథంలో ప్రకృతి వాస్తవతత్త్వాన్ని దర్శించగల ఒక వింత అయిన అంతర దృష్టిని వరంగా పొందిన ద్రష్ట కవి. (The Poet is also a seer, gifted with a peculiar insight into the nature of reality).

ప్లేటో జ్ఞానసిద్ధాంతాన్ని ఆధారంగా చేసుకొని దానిని సౌందర్యానికి అన్వయించాడు షెల్లీ. ఏది నిజమయింది ? ఏది అద్భుతమయింది ? నిజమైన దానిపై అద్భుతమయింది ఏ విధంగా ఆధారపడింది ? ఈ విషయాలను తెలియజేయడానికి తగిన విధంగా వస్తువుల నన్నింటినీ బాగా పరిశీలించాడు షెల్లీ. చిట్టచివరకు తేలే సత్యమే శాశ్వతమైన మేధస్సునీ, అదే జగత్తును కలిపి ధరిస్తుందనీ ఆయన అభిప్రాయపడ్డాడు.

'This whole of suns, and worlds, and men, and beasts and flowers
With all the silent or tempesteuous workings
By which they have been, are, or cease to be,
Is but a vision - all that it inherits
Are motes of a sick eye, bubbles and dreams;
Thought is its cradle, and its grave, nor less
The future, and the past are idle shadows
of throughts' eternal flight - they have no being
Nought in but that which feels itself to be'

(Hellas, II, 776-785, The Poetical works of P.B. Shelly, ed. by Harry Buxton (4 Vols, London - 1882) - III P. 80.

ఆలోచనలో, అనుభవంలో, ప్రతిభలో, భావంలో షెల్లీ వాస్తవ తత్త్వాన్ని కనుగొని Prospero విధ్యావాదం ఖండించాడు. రూపాలను సృజించి

వాటిద్వారా నిత్యసత్యాన్ని బయటపెట్టడమే ఊహాశక్తిచేసే పని అని షెల్లీ విశ్వసించాడు.

కాల్పనికవులలో గొప్పవారంతా అతీతమైన ఒక క్రమంలో ఊహాశక్తి ద్వారా దర్శించడమే తమపనిఅని అంగీకరించారు. వారికి దైవత్వ మొక్కటే సత్యమయింది. "దైవత్వంకానిదేదీ సత్యంకాదు" (nothing is real but spirit) అనే హెగెల్ సిద్ధాంతాన్ని ఒక స్వతంత్రమైన నిదర్శనంగా వారు పేర్కొన్నారు. వారు ఏకత్వాన్ని కాదనే ప్రకటనలు చేశారు కాబట్టి వారు భౌతిక వస్తుతత్త్వవేత్తలు. అయితే వృత్తిరీత్యా ఉన్నటువంటివారుకాదు. వాదంలోకన్నా అంతర దృష్టిలో, విశ్లేషించే సత్యంలోకన్నా ఆనందంలో. మేధస్సు - ఉద్రేకాలు అనే రెండింటినీ లోగొనే ప్రేరణాత్మలో కాల్పనికులు విశ్వాసం ఉంచారు. సత్యంయొక్క పవిత్ర భావంలో, దానిఎదుట పొందే భక్తిపూర్వక విశ్వాసంలో దాని విధానంలో కాల్పనికులు మతసంబంధమైన వారే. కాని కొన్ని ముఖ్యమైన విశ్వాసాలలో వారు ఆస్తికులుకాదు (Romantic Imagination - Sir Maurice Boura - Oxford University Press - Oxford, London University Press, Oxford - I Edn. 1950 7th ed. 1970 PP 22-23) ఎందుకంటే - బ్లేక్ మతం దైవస్థితిని మానవులనుండి వేరుచేసింది. షెల్లీ తానొక నాస్తికుడనని (atheist) ప్రకటించుకున్నాడు. కీట్సు క్రైస్తవమత సిద్ధాంతాలను ఎంత వరకూ అంగీకరించాలో తెలియక తికమకపడ్డాడు. కోలరిజ్, వర్డ్స్‌వర్త్ నియమితమైన ఉత్సాహంతో ఉన్నప్పటికీ, కవిత్వం సృజించేటప్పుడు వారు వేరే విశ్వాసాలతో ఉన్నారు. అందుకే జగచ్ఛక్తిని ఏకాంత ఆత్మ (Solitary Soul) యొక్క అసహాయకృషి ద్వారా అన్వేషించడమే కాల్పనికోద్యమ ముఖ్యలక్ష్యం అని చెప్పవచ్చు.

'Objects that had been seen detached, without atmosphere, were seen by Wordsworth in pure white light; which Keats caught in a prison of his own and Shelly turned to moonlight. Then, lest nature should have under worship, Byron set himself prominently in the foreground Coleridge in fundamentally both naturalistic and romantic, but Shelly is not naturalistic at all, in any way but a romantic sense. What all these

poets, so different in inspiration and tendency united it was in an aim at the emancipation of the world and of the mind and of the Vehicle of poetry from the bondage of fact, opinion, formality and tradition, and when fact, opinion, formality and tradition go out, imagination comes in' - Arther Symons - The Romantic Movement in English Poetry (1909) P. 18.

ఈ ఉద్యమంలోని ప్రతి కవీ తానే ఒక ముఖ్యవిషయాన్ని అన్వేషించినట్లు, ఇతరులెవ్వరికీ అంతుపట్టని రహస్యం కవిత్వంలో తనకే లభ్యమైనట్లు భావించాడు. ఈవిషయంలో కాల్పనికులు ఆత్మత్యాగానికి కూడా సిద్ధమయారు. తమ సౌఖ్యాన్నీ, ఆత్మవిశ్వాసాన్నీ, సృజనశక్తులనూ వెచ్చించారు. స్వప్నాలను కనడంలో సుఖభ్రాంతులను రూపొందించుకోవడంలో మాత్రమే కాల్పనికులు తృప్తిపడలేదు. తాము సృజించినవన్నీ వాస్తవంగా ఉండాలని ఆశించారు. సజీవంగా ఉన్న వాటిని ఎవరైనా ఊహించవచ్చు. అయితే కాల్పనికులు ఏవిధంగానూ ప్రదర్శించలేని శాశ్వతమైన వస్తువులకు చెందిన ఉదాహరణలూ, రూపాలూ, వ్యక్తిగతమయిన సంఘటనల్లో ప్రకటించవచ్చని తలంచారు. కాల్పనికులు వస్తుతః కవులు. కాబట్టి వారు తమమేధస్సుకు అందే జగత్తులోని దృశ్యాలను స్పష్టంగా, భౌతికంగా వ్యక్తిగతరూపాలలో కవిత్వ ముఖంగా ప్రదర్శించారు. ఇతరుల భావాలను ఒప్పుకోడానికీ, లేదా ఊహాశక్తిని వాదంకోసం వదులు కోడానికీ కాల్పనిక కవులు తిరస్కరించారు.

'I must create a system or be inslaved by another Man's,
I will not Reason and Compare, my businesss is to create'

(Blake, Jerusalem in poetry and prose. P. 442)

అంటూ Los ను గూర్చి Blake చెప్పినట్లుగా కాల్పనిక కవులపని కేవలం సృజించడమే.

సృజన ద్వారా భావం మొత్తాన్నీ, మానవాత్మనూ జ్ఞానవంతం చేయడం, సాధారణ వస్తువులలో కూడా వాటి వెనుక దాగినసత్యాన్ని ఊహాశక్తి ద్వారా

పసిగట్టడం, ఒక సాధారణమైన నిర్జీవమైన సంప్రదాయం నుంచి ఎంతో దూరంగా మానవుణ్ణి లోతైన స్మృతికి చేర్చడం, హేతువుతో బాటు ప్రేరణపొందిన అంతరంగ జ్ఞానం యొక్క అవసరాన్ని తెలియజేయడం కాల్పనికులకు వెన్నతో బెట్టిన విద్యలు. 18వ శతాబ్దికి ముందు మనిషికీ కవిత్వానికీ ఉన్న సంకుచిత భావాన్ని కాల్పనికులు విశాల దృక్పథంతో స్వీకరించారు. ఎందుకంటే - మనిషిలో ఉన్న సంపూర్ణమైన దేవతా స్వభావమే పరిగణించబడుతుందని కాల్పనికుల గట్టి నమ్మకం. దానికోసమే వారు అహరహమూ కృషిచేశారు.

అంతేకాదు "Trust your genius; follow your noble heart; Change your doctrine whenever your heart changes; and change your heart often" (Novalis and the Blue Flower - Atlantic Monthly - Dec. 1875) అనే తత్త్వంకలవారు కాల్పనికులు. అందుకే వారి హృదయార్ణవంలో అశాంతిచే చెలరేగిన తుఫానులనూ, సంఘంలో సంభవించే వివిధమైన సంఘటనలనూ, సున్నితమైన హృదయానికి హత్తుకునే భావాలనూ వారు కవితావస్తువులుగా గ్రహించారు.

'Romanticism is the star that weeps, it is the wind that wails, it is the night that shudders, the bird that flies and the flower that breaths perfume; it is the sudden gush, the ecstasy grown faint, the cistern beneath the palms, rosy hope with her thousand loves, the angel and the pearl the white robe of the willows. It is the infinite and the starry etc., etc. - (A history of English Romanticism in the 18th Century by Henry A. Beers (1926) P.21) అనే మాటలు కాల్పనిక కవితత్త్వానికి అద్దం పడతాయి.

అదే విషయాన్ని గూర్చి Prof. Boyeson- 'Romanticism is really on one side retrogressive as it seeks to bring the past, and on the other hand, progressive as it seeks to break up the traditional order of things . . . The conventional machinary of Romantic fiction; night, moonlight, dreams ... Romantic poetry

invariably deals with longing ... not a define desire but a dim, mysterious aspiration" (Novalis and the Blue Flower Atlantic Monthly - Dec. - 1875) అనే వాక్యాలలో ప్రకటించాడు.

## ప్రధాన లక్ష్యాలు

కాల్పనికోద్యమంలోని ప్రధానలక్ష్యాలను ఆచార్య కొత్తపల్లి వీరభద్రరావుగారు ఈ క్రింది విధంగా పేర్కొన్నారు (చూ. తెలుగు సాహిత్యంపై ఇంగ్లీషు ప్రభావం- అముద్రితం)

1. ఆత్మానుభవమే ముఖ్యం కాబట్టి వీరి కవిత్వం ఆత్మాశ్రయ (Subjective) కోవకు చెందింది (అంటే కవేనాయకుడు. ఆతడి అనుభూతే కావ్య వస్తువు)
2. భావవ్యక్తీకరణంలో వక్రోక్తివిధానం లేదా భావస్ఫూర్తి వీరికి ఇష్టం.
3. వాస్తవలోకం వర్ణమయంగా, చిత్రజగత్తుగా వీరు భావిస్తారు.
4. రససాంకర్యం పొందినా వీరికి తప్పులేదు. ఈ లోకంలో ఉదాత్తానుభావాలుగాని, ఉచ్చనీచాలుకాని వీరికి లేవు.
5. వీరి స్వాతంత్ర్యకాంక్ష సంఘాన్నీ, తోటిమానవులను వీడటానికి కూడా సంకోచించదు.
6. నాగరక జీవితంతోపాటు, అనాగరకం, నీచం అయిన జీవితంకూడా కవితా వస్తువుగా వీరికి స్వీకరణీయమే.
7. శిల్పంలో వీరికిగల స్వేచ్ఛ కవిత్వాన్ని విశృంఖల విహారంచేయిస్తుంది.
8. గతకాల వైభవాలనూ, మానవాభ్యుదయ కృషినీ కీర్తించడం, ఆ కాలాన్ని పునరుజ్జీవింపజేయడం వీరికభిమతం.
9. ఇంద్రియగోచరమైన లోకానికి కవిత్వంలో స్థానమిచ్చి, అతీంద్రియ వస్తువులకై అంగలార్చడం వీరికలవాటు.

10. నాయికా నాయకుల సంయోగం పొందని అత్యున్నత స్థాయికి చేరేందుకు వీరికి అమలిన శృంగార సిద్ధాంతం ఒక సర్దుబాటు.

ఇవే కాక మరికొన్ని లక్షణాలు వీరిలో కనిపిస్తాయి. ప్రకృతిపై ప్రీతితో (Love of Nature) దాని అంతస్సౌందర్యానికై అన్వేషణ కాల్పనికుల కొక పరమావధి. మానవతా వాదస్వీకరణతో మనిషిని మనిషిగా గుర్తించే తత్త్వం వీరికుంది. నిరాడంబరత వీరికున్న మరోలక్షణం. అది వారి వస్తు స్వీకరణ, భాషాపదప్రయోగాదులలో కనిపిస్తుంది. అలాగే ప్రాచీన పునరుద్ధరణ వారికొక లక్ష్యం. అదే వారు Blank Verse, Sonnet వంటి పద్యధోరణులను ప్రచారంలోకి తేవడంలో వ్యక్తమవుతుంది. స్వేచ్ఛా ప్రవృత్తి అనేవారి లక్షణం వల్ల కవిత్వంలో విభిన్నతకోసం. స్వీయవ్యక్తిత్వ ప్రకటన కోసం వారుపడిన తపన. అనుభూతి వ్యక్తీకరణానికి తగిన భావగీతి (Lyric) ఎంపిక మనలను ఆశ్చర్యపరుస్తాయి.

ఈ విషయాలనే Long మహాశయుడు తన మాటల్లో 'The Protest against the bondage of rules, the return to nature and the human heart, the interest in old sages and mediaeval romances as suggestive of a heroic age, the sympathy with the toilers of the world, the Emphasis upon individual genius and the return to Milton and Elizabithan instead of pope and Dryden as literary models' అని క్రోడీకరించడం గమనార్హం. (A Critical study of Keats - Dr. R. Tilak)

## సంప్రదాయకత - కాల్పనికత :

సంప్రదాయకత (Classical) కాల్పనికత (Romantic) అనేవి రెండూ చారిత్రాత్మకంగా రెండు ధోరణులు. సాహిత్య పరంగా ఈ రెండు ఉద్యమాలలోనూ ఉన్న కొన్ని విశిష్ట లక్షణాలు అన్ని కాలాల్లోనూ కనిపిస్తాయి. అయితే ప్రతిదేశంలోనూ ఒకే పద్ధతిలో లేవు. అంతేకాదు. ఆ రెండు ధోరణులకు చెందిన కవులు, రచయితలు ఒకే కాలంలో కనబడవచ్చు. ఉదా : బెన్‌జాన్సన్, షేక్స్పియర్ సమకాలికులు.

1830 లో గెథె పండితుడు సంప్రదాయ, కాల్పనిక కవిత్వాల మధ్య గల భేదాన్ని - మొదటిది పరాశ్రయం లేక వస్త్వాశ్రయం **(Objective)**, రెండవది ఆత్మాశ్రయం లేక స్వాత్మకం **(Subjective)** అని పేర్కొన్నాడు. **(Introduction to the study of English Literature K.R. Srinivasa Iyengar and Premanand Kumar (1966) P. 218).**

అలాగే "కాల్పనికత వ్యక్తిగతమైన విలువల వ్యక్తీకరణ, సంప్రదాయకత ప్రపంచపు విలువల వ్యక్తీకరణం . . . సంప్రదాయమైన కళలో గాఢత్వం ఉంది కాని అస్పష్టతలేదు" అని హెర్బర్ట్ రీడ్ అన్నాడు. **(Ibid - P. 221)**

అదే విధంగా యం. ఆర్. రిడ్లే "తప్పనిసరి అయిన దానిని సంప్రదాయ విధానం ఒప్పుకుంటుంది. కాని పరిష్కరించలేని దానిని నెత్తినపెట్టుకోదు. ఎంత తీవ్రంగా ఉద్రేకాన్ని అనుభవిస్తుందో అంతే తీవ్రంగా ఆటంకాన్ని వ్యక్తపరుస్తుంది. రహస్యమైన దానిని ఇష్టపడదు. నైపుణ్యాపరంగా సమైక్య భావంపై నిరాడంబరతపై నొక్కి చెపుతుంది. అయితే కాల్పనికతత్త్వం గట్టిగా ప్రశ్నిస్తుంది, తిరుగుబాటు చేస్తుంది. చాలా తీవ్రంగా ఉద్రేకాన్ని అనుభవిస్తుంది కాని దానిని తక్కువ ఆటంకంతో వ్యక్తీకరిస్తుంది. తరచుగా రహస్యమైన వాటిపట్ల స్పష్టమైన ప్రేమను ప్రకటిస్తుంది. శిల్ప విషయంలో రూపనిర్దుష్టతనే నొక్కి చెపుతుంది. **(Ibid)**

"సంప్రదాయకత, కాల్పనికత అనే రెండూ ఒక క్రమవిధానం అవసరానికీ, సమన్వయానికీ, స్పష్టమైన సమగ్రతకూ ప్రాతినిధ్యం వహిస్తాయి. కాబట్టి మన ఆలోచన, అనుభూతి, చర్య అనే వాటిని క్రమపరచడానికి కలిసికట్టుగానూ విడివిడిగానూ పనిచేస్తాయి అవి. ఇది ఒక ప్రక్క జరిగేపని. మరోవైపు మానవుని సమన్వయ దృక్పథాన్ని తప్పకుండా లెక్కించడానికి నిరంతరం అన్వేషిస్తుంటాయి" అని హెర్బర్ట్ గ్రియర్సన్ ప్రకటిస్తాడు **(Ibid)**

దీనినే కార్లే **"our clothes no longer fit us, that the classical has become the conventional that our spiritual aspirations are being starved, or that our secular impulses are criubbed,**

cofin'd, and confin'd, and the heart and imagination bursts its casements and reaches out..' (Ibid) అని ఉత్ప్రేక్షించాడు.

అదే విధంగా F.L. Lucas ఈ రెండింటిలోఉన్న అపాయాలను గూర్చి పేర్కొంటూ ..

'........ the danger that lies it wait for the Classical Muse is of becoming a blue stocking and a governness; the danger that besets her Romantic sister is of becoming a drunken libertine' అన్నాడు (Ibid)

ఎబర్క్రోంబీ దృష్టిలో 'క్లాసిజమ్' అసలు ఒక మూలకమే (element) కాదు. అయితే మూలకాలను కలిపే ఒక విధానం. ఎందుకంటే క్లాసిజమ్‌కు కాక రొమాంటిసిజమ్‌కు వాస్తవికత (Realism) ఒక వ్యతిరేకమైన మూలకమని ఆయన అభిప్రాయం (Ibid - P. 222)

అయితే గ్రియర్సన్ వస్తురూపాల సంయోజనం రెండింటి విలువలకు ఉన్నతస్థానం కలిగిస్తుంది. (a balance of matter and form, are a certain high degree of worth in both') అని ప్రకటించాడు. ఈ రెండు విధాలైన రచయితల మధ్య ఒక ముఖ్యమైన భేదం ఉంది. సంప్రదాయవాదులు ఒక తీవ్రమైన, నిర్దుష్టమైన రూపభావాన్ని కలిగి ఉంటారు. కాల్పనికవాదులు అత్యాసక్తితో, మౌలికతతో విషయంకన్నా రూపాన్ని తక్కువచేసి చూస్తారు. అందుకే ఎబర్ క్రోంబీ "సంప్రదాయవాదం ఖచ్చితమైన రూపంగల ఆచారాన్నీ, కాల్పనిక వాదమూ అల్పమైన భావజాలమూ అజాగ్రత్తవల్ల కలిసికుంటాయని ప్రకటించాడు. (Ibid- P. 224) అలాగే M.R. రిడ్లే – సంప్రదాయ నిపుణతకు కాల్పనిక నిపుణత వ్యతిరేకమనీ, మొదటిది అత్యధిక సమైక్య భావం, నిరాడంబరతలచే పాలించబడగా, రెండోది గొప్పతనాన్నీ, విస్తరణలను అంగీకరిస్తుందని చెప్పాడు (Ibid)

వీటినే ఇంకా స్పష్టంగా వివరించే ప్రయత్నంలో సంప్రదాయ వాదానికి 'Three dimensional statue' నూ, కాల్పనిక వాదానికి 'Two dimensional Painting' నూ చిత్రీకరించి చూపించారు విమర్శకులు.

దీనినే ఇంకా సంక్షిప్తంగా వివరిస్తూ Quiller Couch "రొమాంటిసిజమ్ - క్లాసిజమ్‌లను జాగ్రత్తగా పరిశీలిస్తే కొందరు సహజంగా రంగుకున్న భావంకన్నా రూపభావాన్ని ఎక్కువగానూ, మరి కొందరు రూపభావంకన్నా అధికంగా రంగు భావాన్నీ కలిగి ఉండటాన్ని గమనిస్తాము" అని అంటాడు (Ibid-P.226)

అ విషయాలను దృష్టిలో పెట్టుకొని Dr. Harko G. Demaar చాలా పెద్ద వివరణ ఇచ్చారు.

"Romantic Literature is that which joins a sense of mystery, wonder, and curiosity as well as individuality in form and thought to ornamental language and technique, classic literature is that which joins sense of self controle and poise, as well as conventionality in form and thought, To charity of language and technique. The Romantic character in art consists in the addition of strangeness to beauty. The classic character in art consists in the addition of restraint and flawlesness to beauty. The essential element of the romantic spirit is curiosity joined to a love of beauty. Romantic poets are often at the mercy of their inspiration, classic poets are mostly the masters of their inspiration. Classic's literature embodies the response of the world, romantic literature the restlessness of the world. A classic work of art is like a Greek temple it stands or falls by its perfect fitness in the relations of its parts to the whole, it is right as a whole and has due proportions as a whole. A romantic work of art is like a Gothic cathdral, it impresses not by its mass effect but its detail and variety". ( A History of Modern English Romanticism - 1924-P13)

పైన వివరించిన విషయాలన్నింటిని పరిశీలిస్తే సంప్రదాయ కాల్పనికవాదాల మధ్య మౌలికంగా ఉన్న భేదాలను ఈ విధంగా క్రోడీకరించవచ్చు.

| సంప్రదాయ వాదం | కాల్పనిక వాదం |
|---|---|
| **విషయం (MATTER) :** | |
| 1. ఒకచిన్న స్వీయచైతన్యంగల సమాజపు సాహిత్యం | 1. వ్యక్తిత్వపు ప్రాముఖ్యంలో క్రొత్తగా చైతన్యవంతమై వ్యాపించిన మిశ్రమ సమాజపు సాహిత్యం |
| 2. బాహ్యానుభవం, బాహ్యమైన భౌతిక వాస్తవస్థితి. చైతన్యహేతువును ప్రయోగించడం | 2. అంతరానుభవం, మానవుని ఆత్మ జీవితపు అనంత స్థితి, చైతన్య రహితమైన సాహస యాత్ర. |
| 3. వాస్తవమైన పరిణామరహితమైన భూమిక, సత్త యొక్క ప్రతిబింబం. | 3. వాస్తవంకాని, మార్పువహించే పలు రకాలు : కొనసాగుతున్న జీవరాశి యుక్తమైన కదలికలు. |
| 4. నిశ్చలమైన మనసు, ఆత్మీయతా ప్రకటన, వివేకం యొక్క కాంతి, న్యాయబద్ధత | 4. అవసరమైన తీవ్రత, ఊనిక ; ఉద్రేకం, అనుభూతుల పాత్ర, ఆత్మీయపాలనం. |
| 5. కొంచెంగా తగు మాత్రమైన ఊహా తత్త్వం | 5. అనంతమైన పరివ్యాప్తి : సంతృప్తి లేనంత ఎక్కువ. |
| **రూపం (FORM) :** | |
| 1. విషయం పూర్తిగా రూపంతో అనుబంధింపబడుతుంది. చాలా తక్కువ సంఖ్యలో నిర్ణయించిన ప్రక్రియలూ, పద్యరూపాలు. | 1. విషయానికి రూపంలొంగి ఉంటుంది. సాహిత్య ప్రక్రియలలో, పద్యరూపాలలో పునరుక్తి |
| 2. వివరణలో ముఖ్యమైన నిర్వహణలో ఎంపిక | 2. వివరణకు స్వేచ్ఛ, ఆధిక్యత |
| 3. స్పష్టత, నిరాడంబరత గల రూపం | 3. మిరుమిట్లుగొలిపే లేదా ఆశ్చర్యకరమైన రూపం. |
| 4. ఒక విగ్రహానికి చాలా సన్నిహితం. రంగు కన్నా రూపం ఎక్కువ | 4. చిత్రానికి చాలా సన్నిహితం : రూపంకన్నా రంగు ఎక్కువ. |
| 5. ఎంపికచేసిన సూక్ష్మీకరణ, గాఢమైన విధానం ద్వారా జీవితంగూర్చి ఒకస్పష్టమైన సంక్షిప్తమైన ప్రకటన కాబట్టి నిద్రనుండి మేలు కోవడం, విశ్వజనీనతను తెలపడం. | 5. సంక్లిష్టమైన, అసంభవమైన ప్రకటన యొక్క వివరణ, ప్రభావంద్వారా, జీవితం గూర్చిన రూపం : కాబట్టి వ్యక్తిగతానుభవం యొక్క ఐక్యత మీద ఎక్కువ ఉనికి. |

Ibid PP227-229

ఏమైనప్పటికీ సంప్రదాయ కాల్పనికవాదాలు రెండూ పరస్పర విరుద్ధాలుకావు. అవి రెండూ ఒకే మనస్సుకు చెందిన రెండు ప్రవృత్తులు, ఒకే నాణానికున్న బొమ్మా, బొరుసు.

## వికాసం

ఆధునికమైన కాల్పనికోద్యమం 'రూసో'తో ప్రారంభమైనట్లు చెప్పవలసి వచ్చినప్పటికీ నిజానికి యూరోపియన్ కాల్పనికతను మధ్యయుగంలోనే గుర్తించవచ్చు. క్రైస్తవమతం రావడంతోటే వీరత్వానికీ, ప్రేమకూ సంబంధించిన కాల్పనికతకు వలసిన నేపథ్యమూ, ముఖ్యమైన భావప్రేరణ లభించాయి. 18వ శతాబ్దం చివరిదశలో జర్మనీలో కూడా కాల్పనిక కళ మిగిలిన విషయాలతో బాటుగా క్రైస్తవ మతానికి అవసరమైన ఏదో ఒక భావాన్నీ, నైతిక తత్త్వాన్నీ వ్యక్తీకరించింది.

1789లో బ్లేక్ రచించిన **'Songs of Innocence'** తో ఆరంభమైన ఆంగ్ల కాల్పనికోద్యమం షెల్లీ మరణించడంతో అంతమైనట్లు భావించి దీనిని **"Romantic Age"** అని పేర్కొన్నారు విమర్శకులు. బ్లేక్, కోలరిజ్, వర్డ్స్‌వర్త్, షెల్లీ, కీట్సు అనే అయిదుగురు కవులూ ఈ యుగంలో గొప్పవారు. పరస్పర భేదం ఉన్నప్పటికీ, దృశ్యవస్తువుల వెనుక అదృశ్యంగా సృజనాత్మక భావనాశక్తి ఏదో ఒక క్రమంలో అంతర దృష్టికి సన్నిహితమై ఉంటుందనే ముఖ్య సూత్రాన్ని మాత్రం వీరందరూ అంగీకరించారు. ఈ నమ్మకమే వారి కార్యక్రమాలకు ఒక ప్రత్యేకతను సంతరించిపెట్టింది, కవిత్వ సిద్ధాంతం, అభ్యాసం అనే వాటిని కవిత్వాన్ని ఒక ముఖ్య వాహికగా రూపొందించింది.

అయితే కాల్పనిక కాలంలోనూ ఆ తరువాత బ్లేక్ మొదలైన కవులతో, వారి సిద్ధాంతాలతో ఏకీభవించినా, ఊహాశక్తి విషయంలో మాత్రం ఒప్పుకోని కవులున్నారు. అలాంటి వారిలో బైరన్, పో అనేవారు ముఖ్యులు. **Pre Raphaelities** అనే కవులు ఊహాశక్తికి ఒక ప్రత్యేక అర్థాన్ని కనుగొనడానికి అన్వేషించారు. కాని వారెవరూ కాల్పనిక దృక్పథాన్ని పూర్తిగా అంగీకరించలేదు. **Dante Gabriel Ressetli** మరో ప్రపంచంకోసం అంగలార్చాడు. ఆతడు దానిని సౌందర్యమని సూత్రీకరించి, ప్రేమ ద్వారా అన్వేషించి, దాని విస్తృతిని

సంకుచిత పరచాడు. స్విన్‌బర్న్ తాను దర్శించిన కవిత్వ భావంలో తప్ప, ఏ అతీతమైన స్థితినీ విశ్వసించలేదు. క్రిస్టినా రోసెట్టీ కొన్ని విషయాలలో కోలరిజ్‌నీ, కీట్స్‌నూ లక్ష్యపెట్టక, క్రైస్తవ మత విశ్వాసానికి చెందిన స్వర్గలోకంపై భక్తిని ప్రదర్శించింది. అంతేకాదు. అతీత స్థితిని గూర్చి బ్లేక్ మొదలైన వారి అస్పష్టభావనలు తన స్పష్టమైన సాహిత్య పరమైన విశ్వాసాలతో సరితూగవని ఆమె నిరూపించింది.

ఇంగ్లండులో కాల్పనిక కవిత్వ చరిత్ర రెండు భాగాలుగా ఉంది. మొదటి దానిలో ధైర్యంగా ఒక మౌలికమైన దృష్టి పెంపొందించబడింది. రెండోదానిలో అది విమర్శించబడింది లేదా అభివృద్ధి పరచబడింది. లేదా పరిమితం చేయబడడమో పూర్తిగా వదిలివేయడమో జరిగింది. ఒక ప్రక్క అభివృద్ధియొక్క సరళరేఖ, మరోప్రక్క విభేదం, ఏమైనప్పటికీ ఈ రెండు భాగాలు చాలా సంతృప్తికరంగా సంపూర్ణస్థాయికి తెచ్చే ఉద్యమంగా కొనసాగినట్లు చెప్పవచ్చు. అందుకే కాల్పనిక కాలంలోనూ ఆ తరువాత ఎక్కువమంది సృజనాత్మక మేధావులపై అది అధికారం చెలాయించింది. దాని ప్రభావం కవిత్వంపై చాలా ఎక్కువగా పడింది. యూరపుదేశాలలో ఇది ఒక అద్భుతమైన విషయం. ఫ్రాన్స్, జర్మనీ, రష్యా, స్పెయిన్ దేశాలన్నిటిలో ఇదే ప్రదర్శించబడింది. అయితే ఇంగ్లండులో మాత్రమే దానినుండి పెంపొందిన కవిత్వం ఒక అతీతమైన మానసిక క్రమంలో ఒక దృగంతరదృష్టి (Visionary insight) తో అనుసంధించబడింది. Hagu, Heine, Lernwntov, Espronceda లలో ఇది తరచుగా కనిపించినా, వారిది కేవలం కాల్పనిక దృష్టికాదు. జర్మనీకి చెందిన ఫ్రెడరిక్ హోల్డర్‌లిన్, రష్యాకు చెందిన Fedor Tyutchev అనే "Continental Poets" మాత్రమే వాస్తవానికి బ్లేక్ మొదలైన ఐదుగురినీ అనుసరించారు. హోల్డర్‌లిన్ సజీవమైన జర్మనీ ద్వారా నశించిన గ్రీకు దేవతల దృష్టిని కనుక్కోవాలనుకున్నాడు. అలాగే Tyutchev వర్డ్స్‌వర్త్ సామర్థ్యాన్ని ఆధారంగా చేసుకొని ప్రకృతి సిద్ధమైన అనాదరణీయమైన వస్తువుల వెనక ఉన్న శక్తివంతమైన మరో ప్రపంచాన్నీ, అక్కడున్న అపాయాలనూ సంఘర్షణలను దర్శించాడు. ఈ విధంగా ఇతర కవులు చేసిన కార్యక్రమమంతా బ్లేక్ మొదలైన అయిదుగురు కవులు చేసిన పనికి ఒక వ్యాఖ్యానంవంటిది అని చెప్పవచ్చు.

సౌందర్యమనేది దృశ్యవస్తువులద్వారా ప్రకటితమయే వాస్తవమైన చిట్టచివరి గుణంగా కాల్పనికులు భావించారు. అందుకే వారి ఊహాశక్తిని ఆకర్షించిన అనేక విషయాలను కవిత్వంలో వారు ప్రకటించారు. వర్డ్స్‌వర్త్‌ను ఆకర్షించిన గ్రామదృశ్యాలు, కోలరిజ్ వర్ణించిన జాగ్రత్ నిద్రావస్థల మధ్య వెలుగొందిన రహస్యం (moonlit mystery between sleep and waking), షెల్లీ కూర్చిన ఆనందకరమైన ఆలోచనా స్రవంతి, కీట్సు ప్రయత్నించిన సృజనాత్మక బ్రహ్మానందం, బైరన్ వివరించిన తోటి మానవుల జీవితాలలోని సాధారణమైన సంఘటనలు ఇందుకు కొన్ని ఉదాహరణలు.

పోప్, డ్రైడెన్ కన్నా, మిల్టన్, స్పెన్సర్‌కన్నా సాధారణ మానవజీవితానికి కాల్పనికులు చాలా సన్నిహితులు. మానవుని శక్తి సామర్థ్యాలను అడ్డుకునే అలవాట్లూ, ఆచార సంప్రదాయాలనుండి వీరు విముక్తి కలిగించారు. అతిసామాన్యమైన విషయాలలో కూడా ఆసక్తిని రేకెత్తింపజేశారు. అద్భుతం అయిన ఆశ్చర్యకరమైన ఒక అనుబంధాన్ని కల్పించి, సహజ సిద్ధమైన నూతన ప్రేమకవిత్వానికి బాటలు వేశారు. ఇంద్రియజ్ఞాన చిత్రంమీద ఒక వెలుగును ప్రసరింపజేసి దాని శక్తిని పెంపొందించారు. ప్రపంచంమీద ఒక ఆత్మీయతనూ, భక్తి విశ్వాసాలను కలిగించారు. దౌడుతీసే ఆనందక్షణాన్ని పట్టుకునేందుకు కావలసిన ఒక శాశ్వత లోకానికి కాల్పనిక కవిత్వం ద్వారాలుతెరిచింది.

కాల్పనికోద్యమం సాహిత్యలోకాన కలిగించిన ప్రభావాన్ని గూర్చి Bertrand Rusell ఈ క్రింది విధంగా చెప్పాడు

"From the later part of the eighteenth century to the present day, art and literature and philosphy, and even politics have been influenced, positively or negatively by a way of feeling which was characterstic of what in a larger sense may be called the romantic movement. Even those who were repelled by this way of feeling were compelled to take account of it, and in many cases were more effected by it than they knew" (A History of western philosophy - London (1950) - P. 70)

# వైఫల్యం

ఏ ఊహాశక్తి కాల్పనికోద్యమానికి అంతస్సత్త్వంగా రూపుదాల్చిందో అదే దృక్పథం పెక్కు ఆటంకాలకు దారితీసింది. ఉదాహరణకు ఊహాశక్తి వాస్తవానికి సంబంధించి ఉండాలనే అభిప్రాయం మంచిదే అయినా అది ఎన్నో సంఘర్షణలకు గురి అయింది. వర్డ్స్‌వర్త్, కీట్సు అనే ఇద్దరూ తమ అసంతృప్తిని ఎదురుగా ఉన్న ప్రకృతితో సంబంధం పెట్టుకొని పోగొట్టుకోవచ్చు. లేదా దృశ్య వస్తువులపై తమకున్న సహజమైన ప్రేమననుసరించి శాశ్వతత్వం ఎదుట తమను తామే దర్శించవచ్చు అని ప్రకటించారు. కాని ఇతరులకిది సాధ్యంకాలేదు. దాంతో వారు ఏనాటికైనా తమ కలలు పండకపోతాయా అని ఆశపడుతూ స్వప్నలోకంలో సంచరించారు. ఇది సాధ్యమా లేక అసాధ్యమా అనే విషయంకూడా వాళ్ళు పట్టించుకోలేదు. వారిలో 'పో' అనేవాడు సహజలోకానికి ఏమాత్రం సంబంధంలేకుండా ఉద్వేగంగా కలలుగన్నాడు. దాంతో ఆయన కవిత్వం యవ్వనం కాంక్షల ఆకర్షణకులోనై ఆచరణకు వ్యతిరేకంగా, సహజత్వానికి దూరంగా సంకుచితత్వంతో ఆవిష్కరించబడింది. అందుకే అది మనకు హృదయ స్పందనను కలిగించదు. ఫలితంగా 'పో' కి వ్యతిరేకంగా కొందరు కవులు తమ పనిని పాడు చేసుకున్నారు. 'పో' యొక్క పరాజయం మొత్తం కాల్పనికోద్యమం స్థాయి మీద ఒక వ్యాఖ్యానంగా పరిణమించింది.

కలలు కనడం ఒక ఎత్తయితే వాటిని బయటపెట్టడం మరోఎత్తు. ఊహాశక్తిని ఆత్మజ్ఞానంతో, ఆత్మ విమర్శతో నిర్వహించకపోతే అదే మానవుడికి ఆకర్షించే ఒక భ్రాంతిగా లేదా ఆత్మ వంచనగా మారుతుంది. అదీ కాక కాల్పనిక దృక్పథం వ్యక్తిగతమైన ఆత్మకు చాలా విలువనిస్తుంది. దాంతో మానవులు స్వీయలోకాలలో విహరించి, బయటి ప్రపంచంలో ఏమి జరుగుతున్నదో కూడా పట్టించుకోని ప్రమాదానికి గురిఅవుతారు. ఈ పరిస్థితిలో వ్యక్తి తన స్వంత సూత్రాలను ఏర్పరచుకొని వాటిని బయటిలోకానికి సమన్వయించడానికి ప్రయత్నిస్తాడు. కళాసృజనకు ఇది ఏమాత్రం ఆటంకం కాకపోవచ్చుకాని, లోకం దృష్టిలో ఇది ఒకపిచ్చి ధోరణి. విక్టర్ హ్యూగో ఆత్మజ్ఞానానికి లోనైనప్పుడు ఇలాగే జరిగింది.

కాల్పనికుల వైఫల్యానికి కొన్ని ముఖ్యమైన కారణాలను పేర్కొనవచ్చు.

1. కాల్పనికులు తమ భావాన్ని చాలా స్వేచ్ఛగా ప్రసరింపజేశారు. ఇంగ్లండులోని కాల్పనిక కవులకు ఇది పూర్తిగా వర్తించకపోవచ్చు కాని 'Romantic' అంటేనే విసుగు పుట్టించే దుస్థితికి తమ భావాన్ని ఇతర కవులు దిగజార్చారు.

2. కాల్పనిక దృక్పథంలో తమ వాంఛలను ప్రకటించే సమయంలో కవులు వాటికి దాసులయే ప్రమాదం ఉంది. ముఖ్యంగా కాల్పనిక కవులు ప్రేరణమీద ఆధారపడ్డారు. ఆశలన్నీ దాని మీదనే పెట్టుకొని, తమ జీవితాలను రూపొందించుకున్నవారు హఠాత్తుగా దాని శక్తిని కోల్పోతే మళ్లీ పొందలేరు. ఇదే కోలరిజ్‌కి ఒక విధంగా, వర్డ్స్‌వర్త్‌కు మరో రకంగా జరిగింది. ఎందుకంటే – ఒక క్లిష్ట సమస్య ఏర్పడ్డప్పుడు వారి కళగానీ, వారికున్న దృక్పథాలుగానీ పనికిరాలేదు. అంతేకాదు. ఇతరులకు ఏ వరాలు సాధారణంగా పనికి రావో వాటిపై కాల్పనిక కవులు ఆధారపడ్డారు. ఫలితంగా ఆ వరాలు అయిపోయి చివరకు వారికేమీ మిగలకుండా పోయాయి.

3. భావనను ఉపయోగించి కాల్పనికులు ఇతర లోకాలను కనుగొనడంలో ఏర్పడిన అతీత స్థితికి వారే భయభ్రాంతులయారు. ముఖ్యంగా ఏ పురాణ కథనో ఉపయోగించే సమయంలో ఇది చాలా ఎక్కువగా ప్రకటితమయింది. వర్డ్స్‌వర్త్, షెల్లీ తమ అభిప్రాయాలను ప్రతీకాత్మకంగా ప్రకటించగల సమర్థులు అయినప్పటికీ సూటిగా ప్రదర్శించడానికి ప్రయత్నించి అస్తవ్యస్తంగా ఆవిష్కరించారు. కోలరిజ్, పో అనే వారిద్దరూ కవిత్వానికి అస్పష్టత అవసరమని నొక్కి చెప్పారు. అయితే దృశ్య భావనల మీద కన్నా వివేకవంతమైన అర్థం మీదకన్నా శబ్దం మీదనే వారు ఎక్కువగా ఆధారపడ్డారు. సృజించిన మాటలో, తిరిగి చెప్పడంలో శబ్దం కూడా ఒక బొమ్మలా ఉపయోగపడుతుందని 'పో' ప్రకటించాడు. కవిత్వానికి ద్రష్టత్వం అవసరమే. అలాగే అర్థంలాగా శబ్దంకూడా అవసరం కాని దానికే పెద్దపీట వేయడం మాత్రం చాలా ప్రమాదకరం. కోలరిజ్ ఇదే పని చేసినట్లు కనిపిస్తుంది. ఆయన కవిత్వంలో అర్థం

మేథావంతంగా కనిపించవచ్చు కాని మనస్ఫూర్తిగా ఆయన దానిని ప్రయోగించినట్లు కనబడదు. దానికి Kubla Khan లోని 'For he on honey dew hath fed And drink the milk of paradise' వంటి పాదాలు ఉదాహరణలుగా పేర్కొనవచ్చు.

4. కాల్పనిక కవిత్వంలో ఖచ్చితంగా సంగీతం కావలసివచ్చినప్పుడు భావాన్ని కొంత వరకూ వదిలివేసే ధోరణిఉంది. ఫలితంగా ఆనందం కలగవచ్చు కాని ఆ కవిత్వంలో ఆశించనటువంటి ఒక బలహీనత కనబడుతుంది. కాల్పనికులు విషాద కవిత్వానికి ప్రభావితులై మధురమైన పాటలనూ, బాధాకరమైన బొమ్మలున్న ఒక రకమైన శ్రావ్యతను ప్రకటించారు. దానికి Lear రచించిన

'Calico pie,
The little birds fly
Down to the calico tree
Their wings were blue
And they sang" Tilly - loo!"
Till away they flew
And they never came back to me!
They never came back!
They never came back!
They never came back to me !"

అనే పద్యం ఒక ఉదాహరణ.

ఉద్రేకంలో, పద్ధతులలో Lear కాల్పనిక కవులలో కొందరి వంటివాడే. అతడి అర్థరహితమైన కవిత్వం సాహిత్యపరంగా కాల్పనిక విధానాలకు చెందిందే. అయితే అతడికి కాల్పనిక విశ్వాసంలో ఒక అస్పష్టత ఉంది. దాంతో సాధనాలలో కాకపోయినా ముగింపులో మాత్రం అర్థం లేని కవిత్వం వ్రాయడానికి అతడు ప్రయత్నించాడు.

ఈ అస్పష్టత వర్డ్స్‌వర్త్, కోలరిజ్, షెల్లీ రచించిన కవిత్వంలో కూడా అక్కడక్కడా కనిపిస్తుంది. ఎందుకంటే మాటలు మోయలేనంత బరువుగల

భావాన్ని ప్రకటించడానికి వారు ప్రయత్నించారు. ఒక్కొక్కప్పుడు ఇది కాల్పనికుల సాధారణమైన లక్షణమేమో అనిపిస్తుంది.

5. కళలో పొందే విజయం సాధారణంగా కళాకారుని పనిమీద ఉన్న పరిమితిని బట్టి ఆధారపడి ఉంటుంది. కాల్పనికులు తాము పొందిన కొన్ని అనుభవైక విషయాలకే తమ కళను పరిమితంచేసుకున్నారు. తరచుగా కవిత్వానికి చెందినా, మామూలు విషయాలు పెక్కింటిని వారు విడిచిపెట్టి విజయం పొందారు. కాల్పనికులు కవిత్వంలో విప్లవకారుల్లా తమకుముందు 18వ శతాబ్దానికి చెందిన కవులలాగా తాము రచించ కూడదని నిర్ణయించుకున్నారు. ఫలితంగా ఒక క్రమాన్నీ, విభిన్నతనూ లక్ష్య పెట్టక, వారి కళ కొన్ని పరిమితులకే లోబడి పోయింది.

6. కాల్పనిక దృక్పథం ఆస్తికత్వానికి చెందిన ఏవాస్తవాన్నయినా తిరస్కరిస్తుందని క్రిష్టినా రోసెట్టీ ప్రకటించింది. నిజానికిది ప్రొటెస్టెంటు మత నియమానికి చెందిన ఆమె స్వీయాభిప్రాయం. బైబిల్ అభివర్ణించే స్వర్గలోకం ఆమెకు ప్రార్థనీయం. అది అందించే సందేశం ఆమెకొక ముఖ్యమూలకం. అయితే కాల్పనికులు సాహిత్యపరంగా మరోలోకాన్ని ఒప్పుకునే తత్త్వాన్ని చాలా తీవ్రంగా ఖండించారు. అలాంటి లోక సంబంధమైన స్వీయ భావనలు ఆధ్యాత్మిక విశ్వాసం కలవి కావు. మరో లోకానికి పోయిన అత్మకోసం ఎదురు చూడటం దృశ్య వస్తువుల వెనుక పొంచిఉన్న ఒక రహస్యమని కాల్పనికుల అభిప్రాయం. వర్డ్స్‌వర్త్ జీవితం చివరిదశలో సాయం సంధ్యాకాలం అందచందాలను **(evening of extraordinary splendour)** దర్శించి, వాటిని క్రైస్తవ మత విధానాలకు ముడిపెట్టడానికి ప్రయత్నించాడు. ఆ సమయంలో హృదయంలో లోతుగా నాటుకున్న స్వీయాభిప్రాయాలు పెక్కింటిని ఆయన విడిచిపెట్టాడు. ఫలితంగా **'Ode on Intimations of Immortality'** అనే ఒక హీనమయిన రచన వెలువడింది.

ఇతరుల నెక్కువగా మనోవేదనకు గురిచేసే దృష్టి కాల్పనికులకు చాలా ఎక్కువ. దానివల్ల మంచి కవిత్వం ద్వారా పొందే ప్రేరణకు ఆటంకమేర్పడుతుంది. మానవులు ఆ అలౌకిక లోకం యొక్క

ప్రతినిధులనీ, వారు దేవతాశక్తుల ద్వారా స్పందిస్తారనీ కాల్పనికుల నమ్మకం. ఆ అభిప్రాయాలను 'The Ancient Mariner', "Promethens Unbound" వంటి పురాణగాథలలో వారు పొందు పరిచారు. ప్రేరణ కలిగించే అంతర దృష్టిలో, ఆకర్షించే దృశ్యాలలో అవి చాలా గొప్పవి. కాని అవి ఏ విధంగానూ మతానికి చెందవు. కాల్పనిక కవులు విశ్వాసాలకు లొంగరు. ఊహాపరమైన రహస్యాలకు ఎంతో విలువనిస్తారు. శాశ్వతత్వం తమ సమక్షంలోనే ఉందని వారి భావన. "ఈ దృశ్యలోకం చుట్టూవున్న అదృశ్య శక్తులవైపు, అతీతస్థితికీ మనం పయనించవచ్చు. ఆ ప్రయత్నంలో మేధస్సు ఒక్కటే వాస్తవం. మానవుని వ్యక్తిగతమైన మేధస్సులో ప్రపంచం యొక్క మేధస్సుకూడా ప్రకటితమవుతుంది". అని కాల్పనికుల అభిప్రాయం. వాస్తవానికి మానవాత్మ – దైవత్వాల మధ్య ఉన్న ఒక సునిశితమైన అంతస్సంబంధమే మతం. అందుకే తమ చివరి విశ్లేషణలో పవిత్రతగల మతపరమైన కవిత్వాన్ని కాల్పనికులు సృజించలేకపోయారు.

7. కవిత్వానికి చుట్టూ ఒక ఆవరణను పెంపొందించుకోవాలని కాల్పనికుల కోరిక. అందుకే ఆగష్టన్స్ కాలంలో కన్నా ఒక విశాల దృక్పథాన్ని వారు ఏర్పరచుకున్నారు. కాని సౌందర్య సంబంధమైన అభిప్రాయంలో వారు కొంత పరిమితికి లోనయారు. ఈ సౌందర్యాదర్శాన్ని షెల్లీ, కీట్సు, రోసెట్టీలు వివిధమార్గాలలో ప్రకటించారు. "దృశ్య వస్తువుల ద్వారా ప్రకటితమయే వాస్తవమైన చిట్ట చివరిగుణం సౌందర్యం" అని కాల్పనికుల భావన. అందుకే దానిని వెతకడమే తమపని అనీ, దానితో ఒక అనుబంధం ఏర్పరచుకుంటే అది తెలుస్తుందనీ వారు నమ్మారు. రోసెట్టిలాగా ప్రేమ వంటిదేదో ఒక పరిధికి కాల్పనికులు పరిమితమై నట్లనిపిస్తుంది. దాంతో వారు ఆలోచనా శూన్యులుగా తయారయారు.

8. కాల్పనిక కవులు తమ కవిత్వాన్ని పరిమితమైన మారుమూల జీవితానికి నియమితం చేశారు. దీనిలో వారెన్నో మార్గాలను కనుక్కున్నారు. వర్డ్స్‌వర్త్‌ను గ్రామ దృశ్యాలు ఆకర్షించాయి. కోలరిజ్‌ని జాగ్రత్‌నిద్రావస్థల మధ్యఉన్న రహస్యం లోగొన్నది. షెల్లీ తన ఆనందవాహినికి చెందిన

ఆలోచనలలో మునిగిపోయాడు. కీట్సు పవిత్రమైన సృజనద్వారా బ్రహ్మానందాన్ని కనుగొనడానికి ప్రయత్నించాడు. అలాగే రోసెట్టి ప్రేమ ద్వారా సౌందర్యాన్వేషణ చేసింది. స్విన్ బర్న్ వస్తుకవిత్వంలో ముఖ్యమైన దానికోసం ప్రయత్నించాడు. వాస్తవానికి ఇవన్నీ పూర్వకవులు ప్రయత్నించిన అంశాలే. అయినప్పటికీ కాల్పనికులు ఊహాశక్తిని కదిలించిన విషయాలూ, ఇతరులకు ఒక అద్భుతమైన మంత్రశక్తి కనబడిన సందర్భాలూ, వారు తిరస్కరించిన అంశాలు ఏవో జాగ్రత్తగా గమనించాలి. కాల్పనికుల విశ్వాసాలతో సంబంధంలేకుండా బైరన్ చాలా భిన్నత్వంగల కవిత్వాన్ని రాశాడు. చాలా రద్దీగాఉండే చోట్ల నివసించే తోటి మానవుల జీవితాలల్లోని మామూలు సంఘటనలు కూడా నిజమైన కవిత్వ ప్రేరకాలని ఆయన కనుగొన్నాడు. **Don Juan** తన హేతువాద వ్యాసాలలో అనూచానంగా సౌందర్యాన్ని గూర్చి చెప్పే భావాలను త్రోసిపుచ్చి, తోటివారి జీవితాలను రూపుగట్టించాడు. బ్లేక్ మొదలైన అయిదుగురు కాల్పనిక కవులూ, వారి తరవాత రోసెట్టీ, స్వీన్‌బర్న్, ప్రకృతికీ మానవుడికీ సంబంధించిన ఉద్రేకపూరిత విషయాలవల్లనే ప్రేరణ పొందారు. వర్డ్సువర్త్ రాసిన చిన్నపద్యాలు కళావిహీనంగా, నిరాడంబరంగా తోచడంవల్ల సాహిత్యలోకంలో మొట్టమొదట అవి మంచి గుర్తింపు పొందలేదు. వాస్తవానికి అవిపట్టణాలలోని కలుషిత వాతావరణానికీ, రద్దీగా ఉండే చోట్లకు దూరంగా ప్రత్యేక పరిస్థితులలో ఏకాంతంగా బ్రతికే జీవితాలకూ అద్దంపడతాయి.

అయితే కాల్పనికులు తమ ఏకాంతత్త్వంతో అందరకూ తెలిసిన ప్రపంచాన్ని గూర్చి హేతువాదకవిత్వం రాయలేకపోయారనడం వాస్తవం. అంతరంగంలోకి దర్శించి, ఆంతరంగిక జీవిత చరిత్రలనుండి అసాధారణమైన అనుభవాలను వేరుచేసి కాల్పనికులు కవిత్వాన్ని పెంపొందించారు. అందుకే బాహ్యప్రపంచం ఒత్తిడికిలోనై ఆత్మపట్ల విశ్వాసంలేని పూర్వులను తమ అంతరంగంవైపు దృష్టి మరల్చండని వారు ప్రబోధించారు. కాల్పనికులు ఆత్మపై దృష్టిని కేంద్రీకరించి, ఎన్నో విజయాలను సాధించారు. కాని అతి సామాన్య మానవుడు కళ్లతో చూడగలిగిన అంశాలకోసం మాత్రం వారెక్కువగా కృషి చేయలేదు.

వాస్తవానికి పోప్,డ్రైడెన్‌ల కన్నా, మిల్టన్, స్పెన్సర్‌ల కన్నా కూడా కాల్పనికకవులు సామాన్య జీవితానికి చాలా సన్నిహితంగా కనిపిస్తారు. వెలివేయబడిన లేదా అణచబడిన వారి కోసం అతిసున్నితమైన తాదాత్మ్యంతో అసాధారణమైన ఒక దృశ్యశక్తినిచ్చాడు బ్లేక్. జగత్తు యొక్క పునస్సృష్టి కోసం, అనంతమైన ఒక విధానాన్ని ప్రకటించడంకోసం ప్లేటోకు చెందిన కవితావేశాన్ని ఉపయోగించాడు షెల్లీ. నిజానికి ఇలాంటివారు కనబడరు. అలాగే వర్డ్స్‌వర్త్ గుంటలలో, నీటి ప్రవాహాల ప్రక్కన సాధువుగా పడిఉండే పురుగులలో, గడ్డిపరకలు ప్రోగుచేసుకునే వారిలో, ముసలి వేటగాళ్లలో, పసిబాలికలలో, తెలివి తక్కువ బాలురలో స్వచ్ఛమైన కవితా విషయాన్ని దర్శించాడు. అదే విధంగా భౌతికమైన ప్రకృతి పట్ల ఒక ప్రేమికుడిగా తనను తాను త్యాగం చేసుకొన్నప్పటికీ, కీట్సు మానవజాతికి దూరం కాక దానిని ఓర్పుతో అర్థంచేసుకోవాలని చెప్పిన అభిప్రాయం నిజానికి సరిక్రొత్తదే. అందుకే కాల్పనిక కవులు మానవజీవితాన్ని లోతుగా అర్థంచేసుకోడానికి ప్రయత్నించి కవిత్వానికి ఒక ప్రత్యేక మానవతను ఆరోపించారని చెప్పవచ్చు.

9. కాల్పనికులు అద్భుతశక్తికి ఒక విలువను, ప్రత్యేక స్థానాన్నీ కల్పించారు. ఆచారంగా ఉన్న కట్టుబాట్లనుండి, మానవసామర్థ్యాన్ని అడ్డుకునే సంప్రదాయం చట్రం నుండి అద్భుతమైన విషయానికి విముక్తి కలిగించి వేగవంతంచేయాలనీ, సాధారణ విషయాలలో కూడా ఆనందహేతువైన అద్భుతశక్తిని రేకెత్తించడంద్వారా అది సాధ్యమవుతుందనీ చాలామంది కాల్పనికులు నమ్మారు. వర్డ్స్‌వర్త్, కోలరిజ్ దృష్టిలో కవిపొందవలసిన శిశు సంబంధిత నిరాడంబరత అదే ! శైశవాన్థతో ఉపమించకపోయినప్పటికీ షెల్లీ తన **Defence of Poetry** లో చాలా వరకూ అదే విషయం యొక్క ప్రభావాన్ని గూర్చి ప్రస్తావించాడు. ఇదే అభిప్రాయంతో మన జీవితంలో అద్భుతం ఒక భాగంగా ఉండాలని సిద్ధాంతీకరించేవరకూ వర్డ్స్‌వర్స్ తన పనిని కొనసాగించాడు. అంతేకాదు. ప్రకృత్యారాధనకు అర్థమిచ్చిన ఒక భక్తి పూర్వక విశ్వాసాన్ని ఆయన అద్భుతశక్తిద్వారా కనుగొన్నాడు. ఈ విశ్వాసమే ప్రముఖులైన అయిదుగురు కాల్పనిక కవుల కవిత్వంపై ఏదో ఒక రకంగా ప్రభావం

చూపించింది. ప్రకృతికి సన్నిహితంగా నివసించవచ్చని నగరజీవితాన్ని తిరస్కరించాడు వర్డ్స్‌వర్త్. పునస్సృష్టిగల లోకంకోసం తన సమకాలికులతో పేచీపెట్టుకొని క్రొత్త ఆలోచనా లోకంలో మునిగి తేలాడు షెల్లీ. కాల్పనికుల కాలంలో అద్భుతకరమైన వింత అయిన ఒక అనుబంధాన్ని సృజించే నూతనత్వంపై ఉన్న ప్రేమ సహజ కవిత్వానికి ప్రథమ ప్రయత్నంగా లెక్కించబడింది.

అంతేకాదు అవేశంకన్నా హేతువు తక్కువ అనే అభిప్రాయానికి వచ్చాడు షెల్లీ. సహజంగా కోలరిజ్ ఒక తత్త్వవేత్త అయినా, ఆతడి కవిత్వం తత్త్వ శాస్త్రానికి చాలా తక్కువ సంబంధం కలిగి ఉంటుంది. బ్లేక్ దృష్టిలో తత్త్వశాస్త్రం ఒక ప్రబల శత్రువు. తత్త్వశాస్త్రం జీవితానందాన్నీ, అద్భుతాన్నీ పాడుచేస్తుందని ఆయన అభిప్రాయం. మేధాశక్తి ఇంద్రియజ్ఞానాన్ని మైమరపిస్తున్నట్లు కనిపించినా, ఊహాశక్తి విశ్లేషించే హేతువుకన్నా అది ఎక్కువని కీట్సు ప్రకటించాడు.

అయితే కాల్పనిక కవులు హేతువుకన్నా ఊహాశక్తి మీదనే తమ దృష్టిని కేంద్రీకరించడంవల్ల ఖచ్చితమైన ఒక ఆలోచనా విధానం వారికి లోపించింది. ప్రేరేపించే ఆలోచనా లక్షణాలనూ, అద్భుతమైన అంతరదృష్టినీ కలిగిఉన్నప్పటికీ, మథించిన మేధాశక్తిని కవిత్వానికి అనుసంధించడం ద్వారా బలం చేకూర్చడంలో మాత్రం కాల్పనికులు విఫలమయారు.

ఈ పరిథులలోనే పనిచేసి కాల్పనికులు స్వంత రాజ్యాన్ని ఏర్పరచుకోగలిగారు. కవిత్వానికి లెక్కించదగిన ఒక గుణాత్మకశక్తిని సంతరించి పెట్టారు. ఇంద్రియజ్ఞాన చిత్రం మీద ఒక కాంతిని ప్రసరింపజేసి దానిని ఒక అద్భుతశక్తిగా మార్చారు. ఇంద్రియజ్ఞానం ద్వారా అతీతంగా పనిచేసే ఊహాశక్తిలో గల నమ్మకమే వారి కవిత్వానికి ఒక అపూర్వశక్తిని చేకూర్చింది. దైవ సంబంధమైన కాంతి భూలోక వస్తువులపై ప్రసరించినప్పుడు, మానవులను భగవంతుడికి ప్రీతి పాత్రంగా చేసే క్షణాలు కొన్ని ఉంటాయని కాల్పనికుల విశ్వాసం.

కాల్పనికులకు ఊహాశక్తిపైగల నమ్మకాన్ని బ్లేక్ 'Eternity' అనే పద్యంలో ..

**'He who binds to himself a joy**
**Does the winged life destroy**
**But he who kisses the joy as it flies**
**Lives in eternity's sunrise'** అనే పంక్తులలో ప్రకటించాడు.

ఆనందాన్ని కలిగించే వేగవంతమైన క్షణాన్ని పట్టుకోవడం ద్వారా శాశ్వత లోకద్వారాలు తెరవడమే కాల్పనిక కవిత్వపు ముఖ్యలక్షణం. అదే విషయం శాస్త్రతత్త్వం నుండి ఇతర కవుల నుండి కాల్పనికులను వేరు చేస్తుంది. ఒకే భావం గల అనుభవాలను అవి ప్రకటించలేని కొన్ని వస్తువులతో కలపడంవల్ల మనకు తెలిసిన ప్రపంచంపట్ల ఒక గౌరవభావాన్నీ, భక్తి విశ్వాసాలనూ, అద్భుతమైన లక్షణాన్నీ కాల్పనికులు పెంపొందించారు.

కాల్పనికకవి మానసికమైన ఒక పరిశీలకుడుగా ఉండటానికి ఎప్పుడూ కోరుకోడు. ఒక క్రమ పద్ధతితో సృష్టించిన లోకంలో కార్యశీలక ప్రతినిధిగా ఉండటానికే ఆతడు అభిలషిస్తాడు. భావనా శక్తిని ఉపయోగించి ఒక క్రొత్త జీవితాన్ని సృష్టించవచ్చునీ, సజీవమైన అనుభవాలను పొందవచ్చునీ ఆతడు నమ్ముతాడు. ఎప్పటికప్పుడు మారుతున్న దృశ్యాన్నీ, దానితోబాటు ప్రతి వస్తువుయొక్క హేతువును పరిశీలించే తత్త్వాన్నీ ఆతడు మనకు అందిస్తాడు. ఈ విషయంలో కాల్పనిక కవి నిజంగా ప్రశంసార్హుడే !

## రొమాంటిసిజమ్ - భావకవిత్వం

ఆంగ్లసాహిత్యంలో సంప్రదాయకవిత్వంపై తిరుగుబాటుగా రొమాంటిక్ ఉద్యమం ఆరంభమైనట్లుగానే, ఆంధ్ర సాహిత్య చరిత్రలో పూర్వపు బంధ చిత్రకవిత్వాలకు వ్యతిరేకంగా మొగ్గ తొడిగిందే నవ్యసాహిత్యోద్యమం దీనికి 19వ శతాబ్ది ఉత్తరార్థంలో గట్టి పునాది పడింది. ఆ సమయంలో భూస్వామ్య వ్యవస్థకు కాలదోషం పట్టింది. వ్యక్తి చైతన్యవంతుడయాడు. "కళ కళ కోసమే' ' అనే అభిప్రాయం వెనకబడింది. మేధావివర్గం వ్యక్తి చైతన్యాన్ని సమాజపరం

గావించేందుకు నడుం కట్టింది. దానికి తోడు వ్యావసాయికంగా, పారిశ్రామికంగా సాధించిన ప్రగతి దేశ ఆర్థిక వ్యవస్థను పటిష్ఠమొనర్చింది. రైల్వే, తంతి, తపాలా సౌకర్యాలు పరస్పర భావవినిమయానికి తోడ్పడినాయి. విద్యాబోధనాభ్యసన రీతులలో వచ్చిన మార్పులవల్ల ప్రజల ఆలోచనా దృక్పథంలో హేతువాదం చోటు చేసుకుంది. పూర్వ సంప్రదాయాలూ, మూఢ విశ్వాసాలూ వమ్ముకాజొచ్చాయి. క్రైస్తవ, బ్రహ్మ సమాజాది మత సిద్ధాంతాలు సామాన్య ప్రజానీకాన్ని ఆకర్షించి మతం మార్పిడికి దారితీశాయి.

దానికితోడు రాజకీయ పరిణామాలవల్ల జమీందారులూ, జాగీరుదారులూ కళా పోషకులుగా రూపొందారు. స్వాతంత్ర్యం, సమానత్వం, సౌభ్రాత్రం అనే మూడు సూత్రాలూ సామాన్యుడి నిత్య జీవన విధానంలో క్రొత్త ఊపిరి నందించాయి. ఆంగ్ల విద్యాభ్యాసం మధ్యతరగతి విద్యావంతుల్ని తయారుచేయడంతో బూర్జువా వ్యవస్థ పునాదులు క్రక్కదలినాయి.

పాశ్చాత్య వాఙ్మయ పరిచయంవల్ల కలిగిన భావ విప్లవం సత్య శివ సుందరమైన ప్రాచ్య సిద్ధాంతంలో పాశ్చాత్యరసవాదాన్ని రంగరించింది. దాంతో ఎన్నో నూత్న సాహిత్య ప్రక్రియలూ, ఛందోరీతులూ ప్రచారంలోకి వచ్చాయి. ముద్రణాసౌలభ్యం ఏర్పడి పూర్వగ్రంథాలెన్నో వెలుగు మొగం చూశాయి. దేశ భాషలకు నిఘంటువులూ, వ్యాకరణాలు అవతరించాయి. పత్రికా ప్రచురణం ఔత్సాహిక కవులకూ రచయితలకూ వరప్రసాదమయింది. అందుకే 19వ శతాబ్దిని “రానున్న మహోదయానికి వైతాళికగీతులు పాడిన ఉషఃకాలం” గా విమర్శకులు పేర్కొన్నారు.

జాతీయ పునరుజ్జీవన వికాసం భారతదేశాన ప్రప్రథమంగా బెంగాలులో ఆరంభమయింది. మైఖేల్ మధుసూదనదత్ వంటి వారి “అనిబద్ధ కవిత్వం” **(Blank Verse)** బంకించంద్ర ప్రభృతుల నవలా సాహిత్యం బహుళప్రచారం పొందాయి. బెంగాలులో ప్రారంభమైన నూత్న సాహిత్య ప్రక్రియలన్నీ అనువాద రూపాలలో ఆంధ్ర దేశాన అడుగుపెట్టాయి. కందుకూరి వారూ, రఘుపతి వెంకటరత్నం నాయుడుగారూ బ్రహ్మసమాజ సిద్ధాంతాలను ఆంధ్రదేశాన ప్రచారం చేశారు. బాల్య వివాహాది దురాచారాలను రూపుమాపడానికి పూనుకున్నారు. సంఘ సంస్కరణకు సాహిత్యాయుధాన్ని ప్రయోగించి, సారస్వత లోకాన్ని

జాగృతంచేసి, ఆధునికాంధ్ర సాహిత్యాన్ని క్రొత్త పుంతలు పట్టించిన మూలపురుషుడు శ్రీ కందుకూరి. గద్యానికి వీరేశలింగంగారు చేసిన సేవను తిరుపతి వేంకట కవులు పద్యానికి చేశారు.

దీనికి తోడు 20వ శతాబ్దంలో జరిగిన ఐరోపా మహాసంగ్రామ ప్రభావం తెలుగు జాతిపై కూడా పడింది. వంగరాష్ట్ర విభజనం (1905)తో చెలరేగిన స్వదేశీయోద్యమం, వందేమాతరోద్యమం, "గిడుగుపిడుగు" అరంభించిన వ్యావహారిక భాషోద్యమం ఆంధ్రుల హృదయ క్షేత్రాలలో స్వాతంత్ర్య భావబీజాలను మొలకెత్తించాయి. స్వేచ్ఛా ప్రియత్వాన్ని పురికొల్పాయి. బంకించంద్ర రవీంద్రుల సారస్వత దీప్తులు ఆంధ్ర భావాకాశంలో భాషాభిమాన కాంతిరేఖలను ప్రసరించాయి. స్పందించిన యువకవి హృదయావేశం భావగీతాలుగా, ప్రబోధ గేయాలుగా రూపొందింది. వస్తువూ, భాషా, భావం, ఛందస్సు, శైలి ఇత్యాది విషయాలలో అతఃపూర్వం స్థిరపడిన అభిప్రాయాలపట్ల ఒక విధమైన తిరస్కార భావం పొడసూపింది. అదే నవ్యకవిత్వావిర్భావానికి నాంది. ఆ నవ్యసాహిత్య చరిత్రలో ఆంగ్ల కాల్పనికోద్యమ 'మానసపుత్రిక'యే భావకవిత.

ఏ సాహిత్యమైనా ఇతర దేశీయ విదేశీయ సాహిత్య సంపర్కంలేకుండా వృద్ధి పొందదు. అందులో ముఖ్యంగా కవిత్వం దేశీయమైన సాంఘికపరిణామాలూ, పరిస్థితులపై ఆధారపడి ఉంటుంది. ఆంగ్ల విద్యాభ్యాసంవల్ల, పాశ్చాత్య వేషభాషలపైనా, ఆచార వ్యవహారాలపైనా మోజు పెరిగింది. స్త్రీ పురుషులు కలిసిమెలిసి చదువుకోవడంవల్ల సాంఘికంగా ప్రేమ వ్యవహారాలకు అంతకుముందు లేని ఒక అవకాశం కలిగింది. యువతరం కలలకూ, సాహసాలకూ గురి అయింది. దానికి తోడు క్షీణ ప్రబంధయుగ లక్షణాలకూ, 19వ శతాబ్దిలో వీరవిహారంచేసిన శబ్దాడంబరానికీ, పూర్వ సాహిత్య సంప్రదాయాలకూ, 20వ శతాబ్ది ఆరంభంలోని అంధానుకరణ కవిత్వానికీ విసిగి వేసారిన యువకవులు తెలుగులో కొరవడ్డ ఆంగ్ల సాహిత్య సుగంధాన్ని ఆధునిక కవిత్వంలో గుబాళింపజేయాలని దీక్షబూనారు. అంతకుపూర్వం వ్యాప్తిలో ఉన్న లక్షణాలకు 'ప్రతిక్రియ'గా ఆంగ్లసాహిత్య చరిత్రలో ఆరంభమైన కాల్పనికోద్యమంలా ఆంధ్ర సాహిత్యంలో పూర్వకవిత్వ లక్షణాలకు ప్రతిద్వంద్విగా భావ కవితోద్యమం ప్రభవించింది. అంతేకాదు. కాల్పనికోద్యమ ప్రభావం తలస్పర్శిగా భావకవిత్వోద్యమంపై ఉండటం గమనించతగిన విశేషం.

పింగళివారన్నట్లు నవ్యకవితా ప్రభావమునకు వేగుచుక్కలా కట్టమంచి వారి 'ముసలమ్మ మరణం' 1900 సం॥ నాటికే పొడసూపినా, 1903కే వెంకటపార్వతీశ్వరుల రచనలు వెలువడినా, 1909లో రాయప్రోలు రచించిన 'లలిత' లో "పవిత్ర ప్రణయకీర్తనము, ప్రకృతి వర్ణనము, ప్రకృతి రహస్య పరిశీలనము, సృష్టి రహస్యగ్రహణము, ప్రకృతిలోని పవిత్ర ప్రణయమును చూచుట, ప్రకృతి ప్రోద్బలముచే కవిలో కలుగు చిత్తసంస్కారము" ఇత్యాది కాల్పనిక కవితా లక్షణాలు పుంజీభవించినట్లు రమా కాంతాచార్యులుగారు ఆ గ్రంథ పీఠికలో పేర్కొన్నారు (నవ్య సాహిత్య వీథులు (1942 – పు 139). 1911 లో విజయనగరాన "ఆంధ్రసాహిత్య సంఘం" స్థాపించబడడంతో నవ్యసాహిత్యారంభమయినట్లు గిడుగు వెంకట రామమూర్తిగారు అభిప్రాయ పడ్డారు. (నవ్యకవిత్వము దాని ఉద్దేశము (వ్యాసం) నోరి నరసింహ శాస్త్రి-ప్రతిభ-జన. 1938-పు. 236) 1913లో ముద్రితమైన రాయప్రోలువారి 'తృణకంకణం'లో **"The Telugu School of Romantic Revival"** అనీ, "అభినవాంధ్రకవితా మండలి' అనీ ప్రకటించబడింది. 1914 సం॥ నుంచి అబ్బూరి" బసవరాజు ప్రభృతులు నవకవితా వ్యవసాయానికి దోహదంచేశారు.

'భావకవిత్వ' మనేది 'లిరిక్' **(Lyric)** కు సమానార్థకం. "అంతర జీవితరహస్యాలను, ఆశయాలను, ఆనంద విషాదాలను, ఉద్వేగాలను, బహిర్గతంచేసే ఒక స్వచ్ఛమైన కవితా స్వరూపమే లిరిక్". దీనికి "ఆత్మాశ్రయమైన భావం, రసభావం, ఆవేశం, గేయాత్మకమైన ఛందోరూపం". ఆవశ్యకాలని "హెగెల్" పండితుని అభిభాషణ. దీనినే రాయప్రోలువారు 'లిరిక్కు నాతి దీర్ఘంగా అనతి వర్ణనాత్మకంగా అర్థోన్ముక్త కథాంగంగా నడుస్తుంది. వివక్ష పూర్తికాదు. ఆకాంక్షకు అవకాశం ఎక్కువ. భావం దృష్టాదృష్టంగా దాగుడుమూతలాడుతూ తనకోసం వెదకు లాడేటట్లు చేస్తుంది' అన్నారు. ('తెలుగులో నాతొలి లిరిక్కులు (వ్యా) సాహితీవాల్యభ్యము (ద్వి.భా) – 1974 – పు160). అలాగే కృష్ణశాస్త్రిగారు 'లిరిక్‌లో ఛందస్సూ, భావమూ కరిగి కలిసి ఒకటైపోతాయి **(The expression and the expressed are one)** .. లిరిక్‌లో ప్రతి శబ్దానికీ ప్రత్యేక పరిమళం ఉంటుంది. ప్రత్యేక వర్ణం ఉంటుంది. ఆశబ్దానికి పర్యాయ పదం ఉండదు.' (లిరిక్ శిల్పం – వ్యాసావళి – 2– పు82–83) అదే విధంగా విశ్వనాథవారు 'కవియొక్క ఒక అవిస్పష్ట వాంఛాంకురము ఒక అంతర్నిగూఢ తాపము ఒక చిన్న కావ్యములో ఊదబడినచో అది భావకవిత్వము' (లిరికల్

పొయిట్రీ (వ్యా) - భారతి - అక్టో - 1939 పు 425) అన్నారు.

ఇక భావకవిత్వ లక్షణాలను పరిశీలిస్తే

## 1) స్వేచ్ఛాప్రియత్వం :

భాష, భావం, ఛందస్సు, అలంకారం, శైలి మొదలైన విషయాలలో ఆంగ్ల కాల్పనిక కవులలాగ ఆంధ్ర భావకవులు అభివ్యక్తిలో తమ ప్రత్యేకతను చాటుకున్నారు. కావ్యానికి వలసిన వస్తువూ, భావమూ, రచనా అనే మూడు విషయాలలో భావానికే ప్రాముఖ్యం ఇచ్చారు. ప్రకృతి సోయగంలో ఎగిరే సీతాకోకచిలుకనుంచి ఆకసాన మబ్బుల చాటు నుంచి తొంగిచూచే చందమామ వరకూ వీరికి వర్ణనీయ వస్తువులే. షేక్స్పియర్ అన్నట్లుగా వీరికి 'చెట్లే మాటలు, సెలయేళ్లే పుస్తకాలు. రాళ్లూ రప్పలూ ధర్మోపదేశాలు. నిరుపేద నిట్టూర్పు, కలుషాత్ముని కన్నీరు, చిన్న పాప చిరునవ్వు, కన్నతల్లి కంటిచూపు, కావుకన్నె కలకివలపు' ఇత్యాదులన్నీ వీరికి కావ్యరసోద్దీపకాలే. (కృష్ణశాస్త్రిగారి కృతులు - విశ్వోదయ (1965) పు. 5-6) ఛందస్సు లక్షణానుగుణంగా కన్నా లయబద్ధంగా ఉండాలని నిర్ణయించారు. **Verse laibre** అనే పాశ్చాత్య వృత్తఫణితిని చేపట్టారు. గురజాడ వారు 'ముత్యాల సరం' అనే క్రొత్త ఛందోరీతిని ప్రవేశపెట్టారు. 'వచనగీతిక' అనే పేరన కవికొండలవారు వచన కవిత్వాన్ని రచించారు (1933) అంతకు ముందే ఈ ధోరణికి దువ్వూరివారు నాంది పలికినట్లు (1921-25) కానవస్తుంది.

## 2. ఆత్మాశ్రయత్వం (Subjectivety) :

కాల్పనిక కవులలాగానే భావకవులు ఆత్మాశ్రయ లక్షణంవైపే మొగ్గు చూపించారు. పాశ్చాత్యులు **Subjective Poetry** ని **Lyrical Poetry** కి పర్యాయంగా గైకొన్నారు. ఉదా:

'నేను స్వేచ్ఛా కుమారుడ నేను గగన
పథవిహార విహంగమపతిని నేను
మోహన వినీల జలధరమూర్తి నేను
ప్రళయ ఝంఝూ ప్రభంజన స్వామి నేను'

(నేను - కృష్ణ పక్షము - కృష్ణశాస్త్రి - పు8)

### 3. మనన ప్రాధాన్యం :

ఆంగ్లపండితులు చెప్పిన 'recollected in tranquillity' అనే లక్షణాన్ని అనుసరించి అంతర్ముఖత్వంతో భావకవులు ప్రతిభావంతులైన కవిత్వం రచించారు.

### 4. సాధన ప్రాధాన్యం (Practice) :

కాల్పనికుల వలనే భావకవులకు అంతశ్చేతనంలోని చైతన్యమే ఆయువు పట్టు. వీరు సౌందర్యారాధకులు, వీరివి అతీంద్రియమైన ఆదర్శాలు, అతీంద్రియమైన ప్రణయాలు. వీరికి నిరాశలోనే ఆశ, అసంతృప్తిలోనే ఆనందం, కన్నీటిలోనే పన్నీరు, పత్యాశాయుతమైన భవిష్యత్తే వీరికి పరమావధి.

### 5. ఖండకావ్యత్వం :

భావకవితాయుగంలో పాశ్చాత్య భాషా సంపర్కంవల్ల ముఖ్యంగా ప్రాచుర్యం పొందింది ఖండ కావ్యం.

### 6. ఆరాధనాతత్వం :

భావకవిత్వంలో స్త్రీ బాహ్య సౌందర్యాన్ని కాక ఆమె అంతస్సౌందర్యాన్నీ, ఆత్మ గుణ వైశిష్ట్యాన్నీ పరిగణిస్తాడు కవి. ప్రకృతిని కూడ మాతృభావంతో ఆరాధించడం భావకవి ధ్యేయం. ఉదా :

'సందెలను దారి దప్పు మిళింద సుతులఁ
దేనెపాలిచ్చి చీకట్లు దిరుగనీక
ఉదయమగుదాక యొడిలోన నిదురబుచ్చుఁ
చేరదీసిన మమతకు 'ఁజిక్కి నలిని'

– రాయప్రోలు – తృణ కంకణం

### 7. మానవతావాదం :

కాల్పనికోద్యమ ప్రభావంతో బాటు 'రూసో' ప్రభృతులు ప్రచారమొనర్చిన మానవోద్యమం కూడా భావకవిత్వంపై ప్రభావం చూపింది. దీనివల్ల తోటి మానవుల సుఖదుఃఖాలలో పాలు పంచుకునే తత్త్వం అలవడి, దేశ ప్రజల కష్ట

నష్టాలను కవితా రూపంగా గానంచేశాడు భావకవి. రక్తగతంగా దేశభక్తి ప్రకటితం కావడానికీ, కవులు కారాగార వాసులవడానికీ ఈ మానవతా వాదమే దోహదకారి అయింది.

## 8. సంక్షిప్తత (Brevity) :

భావకవిత్వం మరీ అంతపెద్దదీ కాక చిన్నదీకాక ఉంటుంది. ఈ సంక్షిప్తతే రసావిర్భూతికి జీవనాడి.

### భావకవిత్వం – విభాగాలు :

భావకవిత్వాన్ని కవితా వస్తు స్వరూప స్వభావాలనుబట్టి చేసే విభాగాలపై కూడా కాల్పనికోద్యమ ప్రభావం చాలా వరకు ఉన్నట్లు కానవస్తుంది.

### 1. ప్రణయం : (Love Poetry) :

ఆంగ్ల కాల్పనికకవులు వర్డ్స్‌వర్త్, షెల్లీ, కీట్సు వంటి వారి ప్రభావంతో, మేఘదూతాది వియోగదుఃఖ కావ్యాల అనుశీలనంతో భావకవుల ప్రణయ కవిత్వం ప్రారంభమయింది. రాయప్రోలువారి 'అమలిన శృంగార తత్త్వం' వీరి కావ్యాలకు ఒక విశిష్టతను సంతరించింది. దీనిపై 'ప్లేటో' ప్రభావం ఉన్నదనడంకన్నా 'ఫ్రాయిడ్' సిద్ధాంతాల వాసన ఉందనడం బాగుంటుంది. 'లిబిడో' ను సంతృప్తి పరచలేనప్పుడు అది మరోవిధంగా మారడానికి ఆస్కారం ఉంది. (Sublimation) అదే రాయప్రోలు వారి 'తృణకంకణా'దు లలో ప్రణయం స్నేహంగా రూపొందే ధోరణి. Herald Kelly & Thiabut చెప్పిన Social Exchange Theory లో కూడా అదే కనబడుతుంది.

'కనులనొండొరుల జూచుకొనుటకన్న
మనసు లన్యోన్యరంజన గొనుటకన్న
గొసరి "యేమోయి" యని పిల్చు కొనుట కన్న
జెలులకిలమీద నేమి కావలయు సఖుడ'

(తృణకంకణం – పు. 28)

భావకవుల ప్రణయ కవిత్వంలో మనస్తత్త్వ శాస్త్ర దృష్ట్యా 'Masochism' (The enjoyment of suffering or a tendency to seek opportunities for being offended or hurt) అనే లక్షణం కూడా కనబడుతుంది.

అందుకే భావకవులలో భగ్నప్రేమికులూ, వియోగదుఃఖార్తులూ ఎక్కువగా కానవస్తారు. ఊర్వశివంటి లోకాతీత ప్రణయాధి దేవత కోసం అంగలార్చడం పరిపాటి అనిపిస్తుంది. విప్రలంభశృంగారం వీరికొక ఆధారభూమిక.

ఆంగ్ల కాల్పనికకవులు స్త్రీని అంగాంగ వర్ణనలతో ప్రదర్శించలేదు. ఆ ప్రభావం భావకవులపై పడింది. పెట్రార్క్ (ఇటలీ) షెల్లీ, కీట్సు, బైరన్ (ఆంగ్ల) అనే కవులు భగ్నప్రేమికులు. బ్రౌనింగు, స్విన్‌బర్న్, రోసెటీ మొదలైనవారు ప్రణయగీతాలు ఆలపించారు. భగ్నప్రణయాన్ని కావ్యవస్తువుగా స్వీకరించారు. అలాగే భావకవులు కాల్పనికధోరణిలో ప్రణయ కావ్యాలల్లారు. తల్లావజ్ఝల వారి 'హృదయేశ్వరి', 'కృష్ణశాస్త్రిగారి ఊర్వశి' బాపిరాజుగారి 'శశికళ' అబ్బూరివారి 'మల్లికాంబ' నాయనివారి 'సౌభద్రుని ప్రణయ యాత్ర' దువ్వూరివారి 'కడపటివీడ్కోలు' వంటివి ఉదాహరణ ప్రాయాలు.

షెల్లీ రచించిన 'Lover's Philosophy' లోని

'The mountains mingle with the river
And the rivers with the ocean
The winds of heaven mix forever
With the sweet emotion
Nothing in the world is single
All things by a law devine
In one sprit meet and mingle
Why not if with thine'

పాదాలలోని ప్రణయ తత్త్వమే

'సౌరభములేల చిమ్ము పుష్పవ్రజంబు ?
చంద్రికలనేల వెదజల్లు చందమామ ?
ఏల సలిలమ్ము పాఱు ? గాడ్పేల విసరు ?
ఏల నా హృదయంబు ప్రేమించు నిన్ను'

(కృష్ణ శాస్త్రి)

వంటి పద్యాలలో ప్రతిబింబిస్తాయి.

గురజాడ అప్పారావుగారిపై **Lyrical Ballads** పీఠికలో **Words Worth** ప్రకటించిన భావాలూ, ఆయన రచించిన 'మైకేల్' వంటి కావ్యాదులలోని ఇతి

వృత్తాలూ ప్రభావం చూపించాయి. అందుకే సామాన్య మానవుల జీవితాన్ని ఇతివృత్తంగా స్వీకరించడం, కావ్య భాష సాధ్యమైనంతవరకూ ప్రజావ్యవహారానికి దగ్గఱగా ఉండటం అనే లక్షణాలను పుణికిపుచ్చుకున్నాడు గురజాడ. కులంకన్నా గుణం మిన్న అనే అభిప్రాయంతో 'పూర్ణమ్మ'లో పూజారి కూతురును, 'కన్యక' లో సెట్టి కుమార్తెను, 'లవణ రాజుకల'లో మాలెతను నాయికలుగా తీర్చిదిద్దారు గురజాడ. 'కన్యాశుల్కం'లో మధురవాణి అనే వేశ్యను తీర్చిదిద్దడం, నాటి ప్రజల భాషను సంభాషణలలో ఉపయోగించడం కూడా ఆ ప్రభావంతో చేసినవే. అంతేకాదు. వర్డ్స్‌వర్త్ రాసిన Narrative Poems వంటి వాటిని 'లవణరాజుకల'లో, 'డామన్ పితియస్'లో గురజాడ వాడుకున్నారు. వర్డ్స్‌వర్త్ రాసిన Lucy Gray కూడా వారి పూర్ణమ్మకథలో ప్రభావం చూపినట్లనిపిస్తుంది.

'Yet some maintain that to this day
She is a living child
That you may see sweet Lucy Gray
Upon the lonesome wild' అనే పాదాల భావం
'కన్నులకాంతులు కలువలచేరెను
మేలిమిజేరెను మేనిపసల్
హంసల జేరెను నడకల బెడగులు
దుర్గను జేరెను పూర్ణమ్మ'

అనే పంక్తులలో ధ్వనిస్తుంది.

రాయప్రోలువారిపై మొదట్లో కాల్పనిక కవుల ప్రభావం అంతగా కనబడకపోయినా, క్రమంగా ఆ కవుల తత్త్వాన్ని ఒంటపట్టించుకున్నారనిపిస్తుంది. నిజానికి Goldsmith రాసిన 'Hermit' ను ఆధారంగా చేసుకొని 'లలిత (1909), టెన్నిసన్ రాసిన 'డోరా'ను అనుసరించి 'అనుమతి' (1910) అనే కావ్యాలను రాయప్రోలు రచించారు. 'లలిత' లోనిఉదాత్తమైన సన్నివేశ పరికల్పనం, 'స్నేహలతాదేవి' కావ్యం మొదట 'ఆట్వే'రాసిన

'Oh Woman, lovely Woman; nature made thee
To temper man; we had been brutes without you ...
Eternal joy, and ever lasting love

అనే పంక్తులను పీఠికకు ముందు ఉదాహరించినతీరు స్నేహలత పాత్రకు ఔన్నత్యానికి చేకూర్చుదం, 'స్వప్నకుమార' కావ్యంలో మొట్టమొదటి సారిగా 'భావగీతం' (Lyric) అనేశబ్దం వాడటం గమనిస్తే రాయప్రోలు వారిపై ఆంగ్ల కవుల ప్రభావం ఎంతగా ఉందో స్పష్టమవుతుంది. రవీంద్రుని ప్రభావం కూడా ఆయనను లోగొన్నట్లు కనిపిస్తుంది.

కాల్పనికుల విప్రలంభవేం భావకవులకు ఎక్కువగా అనుసరణీయమయింది. ఆ సమయంలో పొందే ఆవేదన, ప్రేయసికోసం నిరీక్షణ భావకవులెంతో హృద్యంగా తీర్చిదిద్దారు.

'It is my love that keeps mine eyes awake
My own true love that doth my rest defeat'
వంటి (Shakespeare's Sonnets) భావం
'కంటిరెప్పలు మింటి కప్పుల
నంటిపోయె నిరీక్షణమున ...' (మధుకీల – మల్లవరపు) ...

పాదాలలో ప్రతిబింబిస్తుంది.

అలాగే 'Ay in the very temple of delight
Veild Melancholy has her sovran shrine'

- Ode on Melancholy

వంటి కీట్సు విషాదచ్ఛాయలు

'దారుణపు జీవితంపుటెడారిలోన
తీరనిపిపాస నేదారి తెన్నులేక
నేనె నాదుఃఖబాష్పశోణిత లహరుల
నే విసుగు వేసటలు లేక త్రావినాను'

– దీపావళి – వేదుల

అనే పంక్తులలో ప్రస్ఫుటమవుతాయి.

అదే విధంగా షెల్లీ భగ్నహృదయానికి అద్దంపట్టే "I fall upon the throns of Life, I bleed' వంటి భావావేశం 'నా కుగాదులులేవు నాకుషస్సులు లేవు నేను హేమంతకృష్ణానంత శర్వరిని' (ప్రవాసం – కృష్ణశాస్త్రి). అనడంలోనూ,

' ................ for many a time
I have been half in love with easeful death ....'
Ode to a nightingale

వంటి కీట్సు భావాలు 'నామరణశయ్య పరచుకొన్నాను
నేనె ...' (కృష్ణశాస్త్రి) వంటి విషాదంలోను కనబడతాయి.

ఆలాగే కాల్పనికోద్యమంలోని **Romantic Melancholy** అనే నిరాశావాదం పలాయనతత్త్వం భావకవులను కూడా ప్రభావితం చేసింది.

'O lift me as a wave, a leaf a cloud' (Ode to West wind)

అనే షెల్లీ భావం

'ఓయిసంధ్యాసమీరణా . . . నీదు నునులేత తెక్కలమీద వడిగ, నెత్తికొని పోవరాదె నన్నెచటికేని' (కృష్ణపక్షం) అనే పాదాలలో ఛాయా మాత్రంగా గోచరిస్తుంది.

'and leave the world unseen - And with thee fade away into the forest dim ....' Ode to nightingle' లో కీట్సు చెప్పిన భావమే పెనుమర్తి వారి 'కోకిల' లోనూ, కృష్ణశాస్త్రిగారి విషాద గీతాలలోనూ కనిపిస్తుంది.

అంతేకాదు. దుఃఖాన్ని తోడునీడగా భావించి, విషాదంలోనే ఆనందామృతాన్ని గ్రోలిన షెల్లీని (our sweetest songs are those that tell of saddest thoughts) అనుసరిస్తూ 'ప్రేమదాహాన నెడదతపించుకొలది అమృతమొలికింతు స్మితనయనాంచలముల' (దీపావళి)

వంటి భావాన్ని ప్రకటించిన భావకవుల కాల్పనిక ధోరణిని గమనించాలి.

భావకవుల ఊహాప్రేయసి సృష్టి మీద కూడా షెల్లీ రాసిన **'Hymn to Intellectual Beauty'** తత్త్వం కానవస్తుంది.

'నీవెవరైనా నీపేరేమైనా కానీ,
నవనిత్య యౌవనానందప్రాణీ' (కళ్యాణకింకిణి – మల్లవరపు)

'జగదీశమకుటాగ్రసీమనుండి యుర్విపైజారిన సుధామయూఖరేఖ' (వేదుల) 'శ్రీ లలిత వైజయంతీ పరిమళం, మోహినీ హాస మల్లీ ప్రఫుల్లరుచి, హరజటా పారిజాత లతాంత మధువు' (కృష్ణశాస్త్రి) 'దివ్యభాసితరూప, నవ్య సుందరమూర్తి, నిత్యయౌవనస్నిగ్ధ' (అడివి బాపిరాజు) వంటి భావకవుల ఊహలలో సాక్షాత్కరించిన జగత్సౌందర్యరేఖలు షెల్లీ భావననే స్ఫురింపజేస్తాయి. భావకవులు భావించిన ప్రేయసీ పూజ్యతపై కూడా ఆంగ్ల కవుల ప్రభావం లేకపోలేదు. వారిలో రాయప్రోలు మొదటివారు.

అలాగే తల్లావఝ్ఝలవారి 'వకుళమాలిక' పై బైరను రాసిన **'The Dream'** అనే గేయం, కృష్ణశాస్త్రిగారి "ఊర్వశి"పై స్విన్‌బర్న్ రాసిన **'Ode on Aphrodite'** టెన్నిసన్‌రాసిన **'Dream of Women'** టాగోర్ భావప్రవంతి, బాపిరాజుగారి 'శశికళ'పై కూల్రిడ్జ్‌గారు, కీట్సు చిత్రీకరించిన 'ఎండిమియాన్' విశ్వనాధవారి 'కిన్నెరసాని'పై షెల్లీ రాసిన 'ఎరి తూజా' **(Arethusa)**, నండూరివారి 'ఎంకి' పై బర్న్సు పాడిన స్కాట్లండులోని కర్షకభావ ప్రభావం చూపినాయని సోదాహరణంగా విమర్శకులు నిరూపించారు. (చూ–ఆధునికాంధ్ర కవిత్వము – భావకవిత్వము – సి.నా.రె.)

## 2. ప్రకృతికవిత్వం (Nature Poetry) :

భావకవుల ప్రకృతి కవిత్వంపై ఆంగ్ల కాల్పనికుల ప్రభావం తలస్పర్శిగా ఉంది. వర్డ్స్‌వర్త్ వీరికి తలమానికం అయాడు. పరమేశ్వర సృష్టి విలాసం ప్రతిఫలించిన ప్రకృతిని ఆరాధిస్తే పరమాత్మను పూజించినట్లే అనే కాల్పనికుల సిద్ధాంతం భావకవులకు మార్గదర్శకమయింది. అందుకే బాహ్యజగత్తులో పొందే అశాంతికి విముక్తిగా భావకవి ప్రకృతి మాతను ఆశ్రయించాడు. ఆ విలాసశోభలో పొందిన అంతర్ముఖత్వంవల్ల ఒక తాత్త్విక దార్శనికతను సముపార్జించుకున్నాడు. దాంతో 'గతిక' కూడా కవితావస్తువుగా సాక్షాత్కరించింది. ప్రబంధకవులకంతగా వర్ణన యోగ్యం కాని పల్లెపట్లు కూడా భావకవుల ప్రకృతి చిత్రీకరణంలో ప్రముఖస్థానాన్ని ఆక్రమించాయి. కాల్పనిక కవులు దీనినే **"Pastoral Poetry"** అన్నారు. బ్లేక్, బరన్స్, ఎలన్‌పోవంటివారు ఈ తెగలో ప్రసిద్ధులు. అలాగే భావకవులలో విశ్వనాధ, పింగళి, కాటూరి, దువ్వూరి, కవికొండల, తుమ్మలవంటి ప్రముఖులు ప్రకృతి చిత్రీకరణంలో తమ ప్రతిభను చాటుకున్నారు.

ఆంగ్ల కాల్పనిక కవిత్వంలో ప్రకృతి ప్రీతి, ప్రకృత్యారాధనం ప్రధాన లక్షణాలు.

'One impulse from a vernal wood
will teach you more of man
of moral evil and of good
than all the sages can'

అనే వర్డ్స్‌వర్త్ భావంలో ప్రకృతిని తాదాత్మ్యదృష్టితో చూడాలనే ప్రబోధం వినిపిస్తుంది. ఆయనకు గులాబీపువ్వు, Daffodil మొదలయినవి ప్రకృతి సందేశాన్ని వినిపించాయి. అలాగే షెల్లీ రచించిన 'The cloud', To the Skylark, వంటి గేయాలలో ప్రకృతిలో పొందే తాదాత్మ్యం ప్రకటితమవుతుంది. వర్డ్ స్వర్త్‌కు అస్తమించే సూర్యుడిలో, ఉరకలెత్తే సముద్రుడిలో, రివ్వునవీచే వాయువులో, వన్నెచిన్నెలు ప్రదర్శించే నీలాకాశంలో ఈశ్వరతత్త్వం ద్యోతకమయింది. తాను కోల్పోయిన శైశవ ప్రకృతిని గూర్చి "Ode on the Intimation of Immortality" అనే గేయంలో ఆయన ప్రస్తావించాడు. అలాగే Blake తన Songs of Innocence లో శైశవావాస్థను అభివర్ణించాడు ప్రకృతిలో Romantic Melancholyనీ, Pantheistic feelingను ప్రదర్శించడంకూడా కాల్పనిక కవులలో కానవస్తుంది.

'Little flower - if I could understand
What you are, root and all, and all in all,
I should know what God and man is'

అనే టెన్నిసన్ భావాలు పరిశీలిస్తే ప్రకృతి ద్వారా మానవుడు తన పరమార్థాన్ని పొందవచ్చని వారు భావించారనిపిస్తుంది. 'Nature is the best and truest of all teachers' అనేది వర్డ్స్‌వర్త్ ప్రకృతి పరమైన సిద్ధాంతం. దానికి ఆయన రాసిన 'Tintern Abbey' అనే కావ్యం ముఖ్యోదాహరణం.

కాల్పనిక కవులలాగా భావకవులలో రాయప్రోలు వారు ప్రకృత్యుపాసకులు. తెలుగు గడ్డపై ఉన్న గ్రామ సౌందర్యం ఆయనను ఆకర్షించింది. ప్రకృతిని శక్తి స్వరూపిణిగా భావించి ప్రణయసామ్రాజ్య వైభవాన్ని ప్రత్యక్షంగా ప్రకృతి విలాసంలో దర్శించారువారు.

తూర్పు కొండపైకి ఊగే ప్రొద్దుపాప ఉయ్యాల బంగారు తాళ్లలాంటి కిరణాలతో ఒదగడం, ఉషః కన్య సిగ్గుతో జారిపోయే ఎఱ్ఱచీరను విలాసంగా కప్పుకోవడం, వెన్నెలలు నిద్రపోవడం, నక్షత్రాలు మంచుగుడారాలతో బాటు వెళ్లిపోవడంవంటి రాయప్రోలువారి భావన ముగ్ధుల్ని చేస్తుంది.

'కోయిలలు రాగాలు తీయగ
పువ్వులను మురిపింప తుమ్మెద
కన్నెలతలు సమర్తలాడగ
చైత్రుడేగెను సుఖముగా'
(మంగళమాఘమ్ - మిశ్రమంజరి. పు. 45)

అనడంలో వారి కాల్పనికత ద్యోతమవుతుంది.
అలాగే కృష్ణశాస్త్రిగారు

'ఆకులో ఆకునై - పూవులో పూవునై
కొమ్మలో కొమ్మనై - నునులేత రెమ్మనై
ఈ యడవి దాగిపోనా
ఎట్లైన నిచటనే యాగిపోనా .....
(కృష్ణ పక్షం)

అనడంలో ప్రకృతితో తాదాత్మ్యం ప్రకటితమవుతుంది.

'సాంధ్యకిమ్మీర వర్ణవస్త్రములదాల్చి
గిరితట విహార శృంగారకేళి సొలసి
రమణ జరియించు జలధరార్భకునిగాగ
నేల సృజియింపడో నన్ను నీశ్వరుండు'
(నక్షత్రమాల-దువ్వూరి)

అనడంలో ప్రకృతితో సాయుజ్యం వ్యక్తమవుతుంది.

'వ్రేలిడగ సందులేకుండ విరియబూచి
యున్న చుక్కల పూదోట నొక్క మధుప
మగుచు తమిదీర దివ్య పుష్పాసవంబు
నానియాని మత్తిలి పాడ నగునెనాకు"
(శర్వరి - పెమ్మరాజు)

అనేది కూడా అటువంటిదే.

ప్రకృతికీ ప్రణయానికీ ఒకఅవినాభావ సంబంధం. దానినే వెంకట పార్వతీశ్వరులు

'మంతనంబులయ్యె మాటలు లేకుండ
మోహముద్రలయ్యె ముట్టకుండ
గలఁగాంచుటయ్యె గనుమోడ్పులేకుండ
నిందలేల నాకుఁజందమామ'

(కావ్యకుసుమావళి - భా 2 - పు. 285)

అనే కలువకన్నె విరహంలో ప్రకటించారు

ప్రకృతిలో మధురభక్తియుతమైన ప్రణయానికి వీరి 'ఏకాంతసేవ' ముఖ్యోదాహరణం.

'ఏకాంతసేవలో నీవేళదాకఁ
బద్మాసనంబున్న బడలిక దీఱ
శ్రీపుష్పయోగసంసిద్ధి చేకూర
దేటికిఁ బాడిన పాటయయ్యె' (పు. 63)

అనడంలో ప్రకృతి పురుషుల సంయోగాన్ని వ్యంజించారు జంటకవులు.

'ఆంధ్రా వర్డ్స్‌వర్త్'గా పేరు గాంచిన కవికొండల వెంకటరావుగారి ప్రకృతి వర్ణనలు హృద్యాలూ - అనవద్యాలు. ప్రకృతిలో చిఱుగాలికీ - పెనుగాలికీ, పొదుపుటేరుకు పొదుపుకొండకూ, రేని చుక్కకూ - పగటి పొద్దుకూ మధ్యగల తారతమ్యాన్ని పసిగట్టగల్గిన నిశితమైన చూపుగలవాడు ఆయన. నీటిరొదనూ - చక్రరవాన్నీ, ప్రాణికోటి బ్రదుకుసందడినీ విని పోల్చుకోగల ధీశాలి ఆయన.

'లత చిగుళ్లను జూపె లలిత చూతములకు
నల పచ్చనాకు లల్లాడఁ దొడగె ...

(శృంగారోద్యానం - ఆగడపలు - పు10)

ఇత్యాదులు ఉదాహరణప్రాయాలు

'నొప్పిపుట్టగ సొనల బిందువులు రాల
కొమ్మకొనల పల్లవమొందు కోసికొనుము
ఆ మధుర వేదనాభర మనుభవింతు
పావనమ్మగు మానవ ప్రణయమెంచి'

(మందార శిశువు - ఊహాగానం)

అనే అబ్బూరివారి మాటలలో వేదనను కూడా తియ్యగా భావించే భావకవుల సంప్రదాయం వ్యక్తమవుతుంది. ఆంగ్లకాల్పనికుల కన్నా భావకవులు ప్రకృతి కవిత్వంలో చాలా ఎక్కువ భావావేశాన్నీ, నైర్మల్యాన్నీ ప్రకటించారనిపిస్తుంది.

## 3. ఆధ్యాత్మిక కవిత్వం :

భావకవుల ఆధ్యాత్మిక కవిత్వంపై కాల్పనికుల మర్మకవిత్వం (Mystic Poetry) కొంతవరకూ ప్రభావంచూపించినా, ఆత్మానుభవంతో సత్యశివసుందరమైన దృక్పథాన్ని కలిగించిన వైదిక ఋషులే మన ఆధ్యాత్మిక గురువులు. అనాదిగా ఉన్న ఆధ్యాత్మిక దృక్పథమూ, సూక్తులు' పురాణప్రవచనాలు మన ప్రాచ్య సంప్రదాయాన్నీ సంస్కృతినీ నిలబెడుతున్నాయి. ఈ తత్త్వాన్ని రక్తగతంగా చేసుకొని, ఆ ఆధ్యాత్మిక వాతావరణానికి తగినట్లుగా తమ జీవన విధానాలను పథాలను మలుచుకున్నవారు భావకవులు.

ఈ కవిత్వంలో ఆంగ్ల భావకవులైన బ్లేక్, వర్డ్స్వర్త్, కోలరిడ్జ్, షెల్లీ, కీట్స్, టెన్నిసన్, కూపర్ ప్రభృతులు ప్రముఖులుకాగా, వెంకట పార్వతీశ్వర కవులు, కృష్ణశాస్త్రి, విశ్వనాథ, బసవరాజు, వేదుల, దువ్వూరి మొదలైనవారు తెలుగు భావకవులలో ముఖ్యులు.

కాల్పనికులు లోకంలోని అన్ని పదార్థాలలో పరమాత్మ స్వరూపాన్ని దర్శిస్తారు. 'In the star, in the stone, in the flesh, in the soul and cloud' అనే రాబర్ట్ బ్రౌనింగు మాటలలో అదే కనిపిస్తుంది.

'To see a world in a grain of sand .... and eternity in an air' అనే బ్లేక్ భావనలో ప్రతి పదార్థంలో ఏదో ఒక అతీత శక్తి ఉందనే విషయం స్పష్టమవుతుంది.

మనకూవారికీ మౌలికంగా ఉన్న భావ భేదాన్ని C.F.C. Spurgeon తన మాటలలో 'The ultimate goal of the eastern mystic is summed up in his assertion. "I am Brahman', where as the western mystic belives that' he who sees the Inifinite in all things sees God' (Mysticism in English Literature - P 23) అని వివరించాడు.

స్థూలశరీరం నశ్వరం. కాబట్టి అది పరమాత్మను చేరేందుకు సహకరించదు. బాహ్యేంద్రియ దృష్టికన్నా దివ్యదృష్టివల్ల కలిగే జ్ఞానం భగవద్దర్శన హేతువు. అంతర్ముఖత్వంతో మనోబుద్ధిచిత్తాహంకారాలను దాటి ఆత్మముకురంలో పరమాత్మను దర్శించవచ్చు అని ప్రాచ్య సిద్ధాంతసారం. అయితే పాశ్చాత్యులు ఆత్మ ప్రసక్తికిపోరు. అంతర్ముఖాత్వాన్ని అధిగమించరు. మానవరూపంలో దేవుడు అవతరిస్తాడని వారి విశ్వాసం. పరమాత్మ ఏకత్వమే దృశ్యలోకపు భిన్నత్వమని వారి నమ్మకం. అందుకే బాహ్య జగత్తులోనే పరాత్పరుణ్ణి దర్శించాలని వారి సిద్ధాంతం. అయితే బాహ్యలోకపు భిన్నత్వంలోనే పరమాత్మ తత్త్వ సంబంధమైన ఏకత్వాన్ని సందర్శిస్తారు మన తత్త్వ వేత్తలు ఏబాహ్య లోకం మన ఆధ్యాత్మిక దృక్పథానికి ఒక ఆటంకమో అదే పాశ్చాత్యులకు ఒక ఆధారభూమిక.

కాబట్టి పాశ్చాత్య మార్మిక కవిత్వం మన ఆధ్యాత్మిక కవిత్వానికి ఎక్కువగా సహకరించిందని చెప్పలేము.

వెంకటపార్వతీశ్వరులు పరమాత్మ తత్త్వాన్ని గూర్చి

'పిల్లవానికినై నీవు, విధికి నేను
సూత్రమున కీవు, నేఁ గర్మసూత్రమునకు
ననిలమునకీవు, నే విషయానిలమున
కొదిగి లోఁగి భ్రమించుచునుంటి మహహ'

(కావ్య.కు-2-పు.93)

అని'గాలిపటం'తో అనడం గమనార్హం.

'నా చవిటి మనసు నలగ దున్ని
చాల నమ్మిక విత్తులు చల్లితినిట
నీ నెనరు మంచి నీటిని నింపుమింక
భావ మిగురించి, సస్యమై భక్తిపంటఁ బండు
నీ పేరిమీదుగా బ్రదుకుదుఁ బ్రభు'

(భావసంకీర్తనం)

అనడంలోకూడా వారి భక్తి పారవశ్యం కనబడుతుంది.

'పొదలలో పూవువై పోయినా వేమొ
తమ్మిలో తేనెవై దాగినావేమొ...
నిన్నెందు చూతురా చిన్నారికృష్ణ
ఏ మూల వెదికేనురా మోహనాంగ'

(జడకుచ్చులు – రాధపిలుపు)

అని రాయప్రోలువారనడంలో అద్వైతతత్త్వం ప్రకటితమవుతుంది.

'ఒంటిగా ఉయ్యాల లూగితివా – నాముద్దుకృష్ణా !
జంటగా నిను బిల్వదగదోయీ'
(వటపత్రశాయి)

'వాయింపుమా మురళి వాయింపు కృష్ణ,
తుమ్మెదగండ్లు జుంజుమ్మని పాడు'
(మురళీకృష్ణుడు)

వంటివాటిలో బసవరాజువారి ఆధ్యాత్మిక తత్త్వం వ్యక్తమవుతుంది

'మనసుపొలంబు దున్నితిని మాధవ భావము నందు విత్తితిన్
తన కనిపించు టన్నయది తామరసేక్షణ వానగాగఁ జ
ల్లినయది ముక్తి పంటగ ఫలించును కానగరామి గ్రీష్మమై
మనసు పొలంబు బీడువడి మాడియపోవును విత్తనంబులన్'

అనే విశ్వనాథవారి 'గోపికాగీతలు' మధుర భక్తిపారమ్యాలు.

అలాగే సాత్త్విక పూజ గొప్పదని చాటిచెప్పే దువ్వూరివారి

'విశ్వకావ్యకవీశ, వేదాంతవేద్య
విజ్ఞానమయమైన విస్ఫులింగమున
నంటింపు నా హృదయపుఁగప్పురము
నిరతంబు నీ పాదనీరేజపీఠి
నెత్తావిఁజల్లుచు నేనెవెల్గెదను'

(కవికోకిల గ్రంథావళి–2)

అనే పాదాలలోవారి భక్త్యావేశం ఉదాహరణ ప్రాయం.

భావకవుల ఆధ్యాత్మిక తత్త్వంలో కృష్ణశాస్త్రిగారిదొక ప్రత్యేకతను సంతరించుకుంది. 'తలిరాకు జొంపముల సందులత్రోవలనేలరాలుతుహినకిరణ కోమలరేఖ'గా గోపికను చిత్రీకరించి చేసిన 'అన్వేషణం' వారి మధుర భకిపారమ్యానికొక మచ్చుతునక.

'నానోట నీమాట గానమయ్యేవేళ
నాగుండె నీవుండి మ్రోగింపవా వీణ'

(అమృతవీణ - పు - 71)

'మ్రోయింపకోయ్ మురళి మ్రోయింపకోయ్ కృష్ణ
తీయతేనియ బరువు మోయలేదీ బ్రతుకు'

(అదే - పు - 123)

'నీపదములె చాలు రామా
నీపదధూళులె పదివేలు
నీపదమంటిన పాదుకలు - మ
మ్మాదుకొని ఈజగమేలు'

(అదే - పు - 146)

'శివశివ అనరాదా - శివనామము చేదా'

(అదే - పు - 149)

వంటి శాస్త్రిగారి భక్తి పారవశ్యం భావకవుల ఆధ్యాత్మిక తత్త్వానికి ఎగరేసిన కీర్తి పతాక.

### 4. దేశభక్తి కవిత్వం :

వాస్తవానికి మనదేశభక్తి కవిత్వానికి జాతీయ భావనయే భూమిక. దేశంలో ప్రజ్వరిల్లిన స్వాతంత్ర్యదీక్షయే ఊపిరి. రవీంద్రకవీంద్రుడు, బిపిన్ చంద్రపాల్ వంటి మహోన్నత వ్యక్తుల ప్రబోధమే ఆదర్శం. కాబట్టి మనభావకవుల దేశభక్తి కవిత్వంమీద ఆంగ్ల కవుల 'బాలెడ్స్' ప్రభావంకొంత ఉన్నప్పటికీ దాని పుట్టుకకు మన రాజకీయ వాతావరణమే ముఖ్యకారణం. దానికి తోడు 'జననీ జన్మ భూమిశ్చ స్వర్గాదపి గరీయసీ' అనే మన ఆర్ష సంప్రదాయం ఒక త్యాగతత్త్వాన్ని మేలుకొలిపింది.

**'Breathes there the man with soul so dead**
**Who never to himself hath said,**
**This is my own native land. . . .'**

ఇత్యాది వాల్టర్ స్కాటు పంక్తులు భావకవులలో కూడా కానవస్తాయి. అలాగే కాల్పనిక కవుల గత వైభవస్మరణం' (Glory of the Past) అనే లక్షణాన్ని వర్డ్స్‌వర్త్ చెప్పిన

**'I Travelled among the unknown men**
**In lands beyond the sea**
**Nor, England did I know till then**
**What love I bore to thee'**

అనే పంక్తులు ప్రకటిస్తున్నాయి.

అలాగే **There is no land like England**
**'Where'er the light of day be'**

అనే టెన్నిసన్ భావంకూడా పేర్కొనదగింది.

'ఏదేశమేగినా ఎందుకాలిడిన
ఏపీఠమెక్కినా ఎవ్వరేమనిన
పొగడరా నీతల్లి భూమి భారతిని
నిలుపరా నీజాతి నిండు గౌరవము ...
లేరురా మనవంటి పౌరులింకెందు' (ఆంధ్రావళి)

అని రాయప్రోలు వారు ఎలుగెత్తిచాటారు

'దేశమును ప్రేమించుమన్నా – మంచిఅన్నది పెంచుమన్నా'

అని గురజాడచాటి చెప్పారు. దీని మీద **Love thou thy land'** అన్న మకుటంగల టెన్నిసన్ భావం కొంత ప్రభావంచూపిందనిపిస్తుంది.

విశ్వనాధః

'ఏ రాజుపంచెనో యిచట శౌర్యపుఁబాయ
సమ్ములు నాగుల చవితినాళ్ళ ...' (వేగిక్షేత్రం)

దేవులపల్లి ః

'జయజయజయ ప్రియ భారత జనయిత్రీ దివ్యధాత్రి' (గేయసంహిత)

వేదుల ః

'నెత్తురు లోడ్చిన సత్తువలూడ్చిన
పిశాచదాస్యం నశించిందని
ప్రపంచమంతా ప్రతిధ్వనించగ
స్వతంత్ర శంఖాలూదండి'

(ముక్తఝరి)

వంటి భావకవుల దేశభక్తి కవిత్వం పేర్కొన తగ్గది.

**5. స్మృతికవిత్వం : (Elegy)**

ఈ రకం కవిత్వానికి థామస్‌గ్రే, బ్రౌనింగ్, వర్డ్స్‌వర్త్, ఆర్నాల్డ్ మొదలైనవారు ప్రసిద్ధులు. అదే తత్త్వం తెలుగులో విశ్వనాధ వారి వరలక్ష్మీత్రిశతి, దువ్వూరివారి విషాదమోహనం, జాషువాగారి బాపూజీ వంటి కావ్యాలలో కానవస్తుంది.

'But the large grief which these enfold
Is given outline, and no more (In Memorium)

వంటి టెన్నిసన్ పాదాల భావం దువ్వూరివారి భగ్నహృదయంపై పడిందనిపిస్తుంది

'తెల్లవాటినఁబూదండఁదీసివైవ
దరుణి వేణిక నిలుచు నెత్తావిపోల్కి
మర్త్యమౌ నీ స్వరూపము మాటు వడియు
సారవర్ణాంకిత స్మృతి సమసిపోదు'

(స్మృతికణము)

అలాగే తనకొడుకు మరణాన్ని తలుచుకొని బసవరాజు

'కాపురమొచ్చిన కన్నె పాపాయి
యిల్లుకాళీచేసి వెళ్లిపోయాడు' (జీర్ణం జీర్ణం)

అనడం బాధాకరం.
అదేవిధంగా విశ్వనాధవారు

'నా కులాంగన యాననము చెక్కులద్ద నిం
డకట నన్నద్దుపెట్టకుడు మీరు

నా ప్రియురాలి కంఠము కౌఁగిలించ నిం
డీ కరమ్ములు లాగబోకుడీరు' (వరలక్ష్మీ త్రిశతి-పు.3)

అనడంలో ఆయన భావావేశం వ్యక్తం.

అలాగే నాయనివారు

'అన్నమ్ము తినవచ్చి నీవు కూర్చుందు నాసనమ్మిపుడు
కన్నుల ముందఱ రిక్తమైతోచి కలగించు మమ్ము
మున్నీవు వచ్చుట సుంత జాగైన మోహన రార ।
అన్నమ్ము చల్లారెనందు నిపుడే మనందురా తండ్రి'

(విషాదమోహనం - పు 18)

అంటూ కన్నీరుగార్చడంలో వారి హృదయావర్జక భావం ద్యోతకమవుతుంది.

ఈవిధంగా పరిశీలిస్తే భావకవిత్వంమీద కాల్పనిక కవిత్వ ప్రభావం ఎంత ఉన్నదో తెలుస్తుంది. ఏది ఏమైనప్పటికీ మన భావకవిత్వం అభ్యుదయ కవిత్వం ప్రారంభమయే వరకూ కొనలు సాగింది. ఆంగ్ల కాల్పనిక కవులమీద విమర్శ వెల్లువెత్తినట్లుగానే మన భావకవులమీద ముఖ్యంగా కృష్ణశాస్త్ర్యాదులమీద గాలి దుమారం ఎంతో లేచింది. **'The old order changeth yielding place to new'** అనే టెన్నిసన్ మాట ప్రకారం ఎప్పటికప్పుడు సాహిత్యం క్రొత్త పుంతలు త్రొక్కుతూనే ఉంటుంది.

అందుకే భావకవిత్వం ఒక రసధుని. మానవజీవితంతోపాటు కొనసాగే ఒక జీవన స్రవంతి.



## REFERENCE BOOKS


1. The Romantic Movement in English Poetry - Arthur Symons - London - Archibald Constable & Co. Ltd. 1909.
2. A History of Modern English Romanticism - Dr. Harko. G. Demaar. Vol 1 Elizabethan and Modern Romanticism in the 18th Century Humpherey Milford. Oxford University Press, London, 1924
3. A History of English Romanticism in the 18th Century - Henry A Burs. London - Kegan Paul - Trench - Trubner & Co. Ltd. 1926
4. The Romantic Theory of Poetry - A.E. Powell (Mrs. E.R. Dodds) London - Edward Arnold & Co., 1926
5. The Defence of Poetry - Variations on the theme of Shelly - Benedetta Croce - Oxford - At the Clarendon Press, 1933.
6. The Decline and Fall of Romantic Ideal - F.L. Lucas 1948.
7. A Background of the study of English Literature - B. Prasad - Machmilian Edn. 1977.
8. Introduction to the study of English Literature - K.R.Srinivasa Iyengar and Premananda Kumar - Asia Publishing Home - Bombay - 1966.
9. Romanticism - Lilian R Furst (1969) Printed in Great Britain
10. Romantic Imagination - Sir Maurice Boura - Oxford University Press - Oxford London, University Press Oxford I-Edn. 1950 - 7th Edn. 1970.
11. Romanticism - edited by John B. Halsted Machmillan - London - Melbourne 1969
12. A Guide to English Literature - By F.W. Bateson.
13. Macropedia - 15th
14. తెలుగు సాహిత్యంపై ఇంగ్లీషు ప్రభావము (అ.ము)

– కొత్తపల్లి వీరభద్రరావు

15. ఆధునికాంధ్రకవిత్వము - సంప్రదాయములు : ప్రయోగములు

- డా॥ సి. నారాయణరెడ్డి 1977

16. ఆధునికాంధ్ర కవితా సమీక్ష

- ఆచార్య కాకర్ల వెంకట రామనరసింహం 1982

17. భావకవులు - ప్రతిభావిస్ఫూర్తి

- డా॥ శివలెంక ప్రకాశరావు - 1987

